# ఈనాడు ఆదివారం

25 సెప్టెంబరు 2016



## మీ ఇంటికొస్తాం... నట్టింటికొస్తాం!

# అమ్మో... భయం భయం!

బల్లిని చూస్తే భయం. పిల్లిని తాకాలంటే భయం. నీళ్లలోకి వెళ్లాలంటే భయం. ఒంటరిగా పడుకోవాలంటే భయం. ప్రతి ఒక్కరినీ ఏదో ఒక విషయంలో తెలీని భయాలు వెంటాడుతూనే ఉంటాయి. పాపం మన హీరోయిన్లకూ అలాంటి భయాలు చాలా ఉన్నాయి. మరి ఎవరి భయం ఏంటో తెలుసా...

## పక్షుల్ని చూస్తే...

చిలక పలుకులూ, హంస నడకలూ అంటూ అమ్మాయిల్ని పక్షులతో పోల్చడం మామూలే. చాలామంది పక్షుల్ని గుంపుగా చూడటానికి ఇష్టపడతారు. కానీ ఆ జాబితాలో కాజల్ అగర్వాల్ ఉండదు. ఆమెకు పక్షులంటే చచ్చేంత భయం మరి. చిన్నప్పుడు తన స్నేహితులు పావురాలూ, చిలకలతో ఆడుతుంటే ఆమె మాత్రం పొడుస్తాయేమోనన్న భయంతో దూరంగా వెళ్లిపోయేదట. పెద్దయ్యాకా ఆ భయం అలానే వెంటాడుతూ వచ్చిందట. కానీ 'మారి' అని తమిళ సినిమాలో చేతిలోకి పావురాల్ని తీసుకోవాల్సిన సన్నివేశం ఉందని దర్శకుడు చెప్పగానే కాజల్ ఏడ్చినంత పని చేసిందట. కానీ సహనటుడు ధనుష్ ధైర్యం చెప్పడంతో ఆ సన్నివేశాన్ని గట్టెక్కించేసింది.

## ఒంటరిగా కష్టమే

'ఎవడు', 'ఐ' లాంటి సినిమాల హీరోయిన్ అమీ జాక్సన్‌కు దెయ్యాలంటే భయం లేకపోయినా చీకటంటే మాత్రం చచ్చేంత భయమట. చిన్నప్పుడు శుక్రవారం రాత్రుళ్లు క్రమం తప్పకుండా టీవీలో వచ్చే హారర్ థ్రిల్లర్ సినిమాలు చూస్తూ పెరగడమే దానికి కారణమట. 'ఒకప్పుడు నాకు ఇష్టం లేకపోయినా మా పెద్దక్క ప్రతి శుక్రవారం హారర్ సినిమాలను బలవంతంగా చూపించేది. వాటిలో చీకటిగా ఉన్నప్పుడల్లా ఏదో ఒక చెడు సంఘటన జరిగినట్లుగా చూపించేవారు. దాంతో నాకు దెయ్యాలకు బదులుగా చీకటంటే భయం మొదలైంది. క్రమంగా లైట్లు వెలగకపోతే మా ఇంట్లో కూడా నడవలేని స్థితికి చేరుకున్నా. ఇప్పటికీ పడుకోవాలంటే గదిలో ఒక చిన్న బల్బు వెలగాల్సిందే' అని భయం భయంగా చెబుతుంది అమీ.

## కల్లోనూ వదలవు!

చాలామంది అమ్మాయిలకు బొద్దింకలను చూస్తే భయం. కానీ శ్రుతి హాసన్‌కు మాత్రం బల్లులూ, పాముల్ని చూస్తే భయం. ఇంట్లో బల్లి కనిపిస్తే దాన్ని బయటికి పంపించే వరకూ పెద్ద యుద్ధమే చేస్తుందట. ఇక పాముల సంగతైతే... బంధించిన వాటిని చూడ్డానికి కూడా తనకు ధైర్యం సరిపోదంటుంది. "హిందీలో 'గబ్బర్' సినిమాలో నటిస్తున్నప్పుడు అక్షయ్ కుమార్ పాములంటే భయాన్ని పోగొట్టడానికి చాలా ప్రయత్నించాడు. వాటిని నా చేతిలో పెట్టే ప్రయత్నం చేశాడు. కానీ నేను ముట్టుకోలేకపోయా. అప్పుడప్పుడూ పాములతో కలిసి నటించాల్సిన సినిమాలో అవకాశం వచ్చినట్లు పీడ కలలొస్తుంటాయి. నిజ జీవితంలో భయాలు కలలో కూడా వదలవా అని ఆశ్చర్యమేస్తుంటుంది" అంటుంది శ్రుతి.

## ఎవరైనా ఎత్తుకెళ్తారని..!

చిన్నప్పుడు టీవీలో కొన్ని హారర్ షోలు చూసిన దగ్గర్నుంచీ అతీంద్రియ శక్తులూ, దెయ్యాలూ ఉంటాయన్న నమ్మకం తాప్సీలో పెరిగిపోయింది. అప్పట్నుంచీ ఇప్పటిదాకా ఆమె ఒంటరిగా పడుకోవడానికి కాస్త భయపడుతుందట. 'చిన్నప్పుడు కొన్నాళ్లు వరసగా దెయ్యాల సీరియళ్లు చూశాక ఒంటరిగా పడుకుంటే నాకేదైనా జరుగుతుందేమో, ఎవరైనా ఎత్తుకెళ్లిపోతారేమోనన్న భయం మొదలైంది. అప్పట్నుంచీ మా చెల్లి పక్కనో, అమ్మ పక్కనో పడుకోవడం అలవాటైంది. వాళ్లు మధ్య రాత్రి లేచి వెళ్లిపోతారేమోనన్న భయంతో కాలో, చెయ్యో పైన వేసి పడుకునేదాన్ని. దురదృష్టం కొద్దీ పెద్దయ్యాక కూడా ఆ భయం వదిలిపోలేదు. అందుకే 'గంగ' సినిమా అవకాశం వచ్చినప్పుడు నా వల్ల కాదేమో అనిపించి, మానసికంగా సిద్ధమవడానికి నెల రోజుల సమయం తీసుకున్నా. ఆ సినిమా విడుదలయ్యాక కూడా చాలా రోజుల దాకా చూడలేదు' అంటూ తన భయాన్ని బయటపెడుతోంది తాప్సీ.

## నీళ్లలో గాల్లో...

'లెజెండ్', 'కబాలి' లాంటి సినిమాల్లో కనిపించిన రాధికా ఆప్టే 'ఫోబియా' పేరుతో నలుగురిలోకి రావడానికి భయపడే అమ్మాయి పాత్రలో ఓ బాలీవుడ్ సినిమాలో నటించింది. సినిమా సంగతి పక్కన పెడితే రాధికాకు నిజ జీవితంలోనూ కొన్ని చిత్రమైన భయాలున్నాయట. 'నాకు ఈదడం వచ్చు. కానీ నడి సముద్రంలో ప్రయాణమంటే చచ్చేంత భయం. విమానంలో గాల్లో ఉన్నంతసేపూ నా ప్రాణాలు గాల్లో కలిసిపోతాయేమో అనిపిస్తుంటుంది. బహుళ అంతస్తుల భవనాల పైన ఉండే ఈత కొలనులను చూసినా తెలీని ఆందోళన' అని చెబుతుంది రాధిక.




## అప్పుడు పన్ను 97.75 శాతం!

ప్రస్తుతం మనదేశంలో వ్యక్తిగత ఆదాయపు పన్ను కింద గరిష్ఠంగా వసూలు చేసే పన్ను 30 శాతం. వార్షిక ఆదాయం రూ.10 లక్షలు దాటితే ఈ పరిధిలోకి వస్తారు. కోటి దాటితే 15 శాతం సర్‌ఛార్జీ ఉంటుంది. అంటే గరిష్ఠ పన్ను 45 శాతం. కానీ 1970, '80ల్లో ఆదాయపు పన్ను రేట్లను చూస్తే కళ్లు బైర్లు కమ్మాల్సిందే! ఇప్పుడీ విభాగంలో మూడు శ్లాబ్‌లు ఉంటే అప్పట్లో పదకొండు శ్లాబ్‌లు ఉండేవి. 10 నుంచి 85 శాతం వరకూ పన్ను వేసేవారు. 1973-74లో ఆదాయం రూ.2 లక్షలు దాటితే పన్ను 85 శాతం. దీనిపైన 10 శాతం సర్‌ఛార్జీతో 93.50 శాతం, దానిపైన మళ్లీ సర్‌ఛార్జీతో 97.75 శాతం అయ్యేది.




అంటే వందలో చివరకు మిగిలేది రూ.2.25 మాత్రమే! పన్ను రేట్లు ఇలా పన్ను పీకేలా ఉండటాన్ని ప్రత్యక్ష పన్నులపైన అధ్యయనానికి వేసిన ఓ కమిటీ తప్పు పట్టింది. పన్ను రేటు ఎక్కువగా ఉండటంవల్ల ఎగవేతదార్లు పెరుగుతారని హెచ్చరించింది. ఆ తర్వాత నుంచీ ప్రభుత్వం పన్ను శాతాన్ని తగ్గిస్తూ వచ్చింది. 1974-75లో సర్‌ఛార్జీతో కలిపి గరిష్ఠంగా 77 శాతం ఉండగా, 1976-77లో దాన్ని 66 శాతానికి తగ్గించారు. మధ్యలో శ్లాబ్‌లనూ తగ్గించారు. 1985-86లో నాలుగు శ్లాబ్‌లతో గరిష్ఠ పన్నును 50 శాతంగా చేశారు. 1992-93లో మూడు శ్లాబ్‌లతో గరిష్ఠ పన్నును 40 శాతంగా, 1997-98లో 30 శాతంగా మార్చారు.

# లోపల...



**మీ ఇంటికొస్తాం... నట్టింటికొస్తాం!**



రుచుల నుంచి సౌందర్య సేవల వరకూ, డాక్టర్ల నుంచి పని మనుషుల దాకా... సర్వం మీ గడప ముందే సిద్ధం! 'ఆన్ డిమాండ్ హోమ్ సర్వీస్' కోట్ల రూపాయల వ్యాపారంగా రూపుదిద్దుకుంటోంది. దీంతో సామాన్యుడికి మహారాజ వైభవం దక్కుతోంది. కాకపోతే కాస్త చమురు వదుల్తుందంతే! **7**





# మీ మాట

ఈ సంచికపై మీ అభిప్రాయాలను sunday@eenadu.netకు మెయిల్ చేయవచ్చు.

### మేలుకొలుపు

'నిదానమే విధానం - కైజెన్ సూత్రం' కథనం ఆలోచింపజేసింది. ఒక్క మాటలో చెప్పాలంటే ఉరుకుల పరుగుల జీవితాలకు మేలుకొలుపులా ఉంది. కొద్దికొద్దిగా మొదలైన మార్పే దీర్ఘకాలంలో కొండంత ప్రభావం చూపుతుందనీ ఆకాశమంత ఎత్తుకు తీసుకెళ్తుందనీ తెలియజేసింది.

*- ఎస్.శ్రీనివాసరాజు, హైదరాబాద్*
*- వసంత(ఈమెయిల్)*

### పెద్ద మనసు

ఈ వారం కథ 'అల్లుడుగారు' చాలా బాగుంది. పెద్ద మనసుతో రాహుల్‌లా ఆలోచించే అల్లుళ్లు చాలా అరుదుగా ఉంటారు. రాహుల్ అత్తగారి ఇంటిలోని కష్టాలూ బాధలను తనవిగా భావించి పరిష్కరించడానికి ప్రయత్నించిన విధానం ప్రశంసనీయం.

*- డి.రామకృష్ణ, ఆదిలాబాద్*
*- భాను(ఈమెయిల్)*

### అద్దంపడుతున్నాయి

మధ్యపేజీల్లోని హ్యాండ్‌బ్యాగులు చూడముచ్చటగా ఉండటమే కాకుండా ఆధునిక సాంకేతిక పరిజ్ఞానానికీ అద్దంపడుతున్నాయి. సెల్‌ఫోన్ లేదా ల్యాప్‌టాప్ ఛార్జింగ్ పెట్టుకునే వీలున్న హ్యాండ్‌బ్యాగ్‌లు ఉపయుక్తంగా ఉన్నాయి. రాతికొండ మీది బిడ్డ రూపం ఆలోచింపజేసింది.

*- ఎం.భరత్‌కుమార్, మెదక్*
*- జి.మీన(ఈమెయిల్)*

### స్ఫూర్తిదాయకం

ద్రోణాచార్య అవార్డు గ్రహీత నాగపురి రమేష్‌గారి జీవిత విశేషాలు స్ఫూర్తిదాయకంగా ఉన్నాయి. ఆయన శిష్యులు మరెన్నో పోటీల్లో గెలుపొంది దేశానికి పేరు తేవాలని మనసారా కోరుకుంటున్నాం.

*- వి.అభిషేక్, మహబూబ్‌నగర్*
*- గీత(ఈమెయిల్)*

### హర్షణీయం

రకుల్‌ప్రీత్ సింగ్ చెప్పిన అందం, ఆరోగ్య సూత్రాలు ఆచరణీయం. భారతీయ విలువలకు ప్రాధాన్యమిచ్చే ఉర్జిత్ పటేల్ లాంటి వ్యక్తి ఆర్‌బీఐ గవర్నర్ కావడం హర్షణీయం. పూల ఆకారాల్లోని స్వీట్లు చూడముచ్చటగా ఉన్నాయి.

*- ఎం.వెంకట్, కాకినాడ*
*- జి.రాజు(ఈమెయిల్)*

### మానవత్వం

రైలుబండి అభిమాన సంఘం వెబ్‌సైట్‌ను ఏర్పాటుచేసి అందులో రైళ్లకు సంబంధించిన విశేషాలను పొందుపరచడం బాగుంది. హిందూ ముస్లింల ఐకమత్యానికి చిహ్నంగా నిలిచిన సంఘటనలు మతంకంటే మానవత్వమే గొప్పదని చాటుతున్నాయి. చివరిపేజీలో జంతువుల పుర్రెల మీద చెక్కిన బొమ్మలు ఆశ్చర్యపరిచాయి.

*- బి.వెంకటరమణ, నరసాపురం*
*- రూప(ఈమెయిల్)*

**మంచిమాట**

**ధైర్యమంటే భయం లేకపోవడం కాదు, భయాన్ని జయించడం.**



## నాన్న చెబితే... అంతే!

**ర**వి హోంవర్క్ చేస్తున్నాడు. చిన్న సందేహం వచ్చి 'నాన్నా, మైలు పొడవా? కిలోమీటరు పొడవా?' అని అడిగాడు తండ్రిని.

ఆయన కాసేపు ఆలోచించి 'కిలోమీటరే' అన్నాడు.

రవి అది రాసుకోబోతుండగా అక్కడే ఉన్న తల్లి వారించి 'మైలే పొడవని రాసుకోరా' అంది.

'నీకెలా తెలుసమ్మా' అడిగాడు రవి.

'మీ నాన్న చెబితే అది కచ్చితంగా తప్పే. ఆయన తెలివితేటలు నాకు తెలియవా ఏం' చెప్పింది తల్లి.




**సాధారణంగా ఇద్దరు వ్యక్తులు నోరు తెరిస్తేనే వాదన సాధ్యపడుతుందంటారు. భార్యలకు ఈ సూత్రం వర్తించదు.**

## గిఫ్ట్ ఇవ్వవా

**'నా**కు ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తోందిరా' స్నేహితుడితో చెప్పాడు సూరి.

'ఈనెల 15దాకా ఆగరా, ప్లీజ్' బతిమాలుతున్నట్టుగా అన్నాడు గిరి.

'ఎందుకలా?'

'ఆరోజు నా పెళ్ళికదరా, గిఫ్ట్ ఇవ్వవా?'

## చచ్చిపోయావుగా



**చింటూ:** తాతయ్యా, మా మాస్టారు వస్తున్నారు. త్వరగా దాక్కో.

**తాత:** ఆయనొస్తే నేను దాక్కోవడం ఎందుకురా?

**చింటూ:** నువ్వు చచ్చిపోయావని చెప్పి ఇవ్వాళ బడి మానేశాన్లే.

## మా ఆవిడక్కూడా...

**రవి:** పాపారావు తెలుసుగా, వాళ్ళావిడకి హఠాత్తుగా మాటపడిపోయిందట. విన్నావా?

**హరి:** విన్నా విన్నా. మా ఆవిడను ఆమె దగ్గరకు పంపించాను కూడా.

**రవి:** వాళ్ళు మీకు బాగా దగ్గరా?

**హరి:** అదేంకాదు. ఆ జబ్బుకు అంటురోగ లక్షణాలేమైనా ఉంటే కాస్త మా ఆవిడక్కూడా అంటుకుంటాయనీ.

## ఇంకెందుకూ...



**'అ**మ్మాయి ఎవర్నో ప్రేమించిందనుకుంటా నండీ' భర్తతో చెప్పింది అనసూయ.

'అలా ఎందుకనుకుంటున్నావు?'

'ఇంతకుముందు నెలనెలా పాకెట్‌మనీ అడిగేది. ఇప్పుడు అడగడం మానేసింది'.

## నువ్వు నచ్చావంటే...

**సుందర్:** నిన్న పెళ్ళిచూపులకు వెళ్ళొచ్చావు కదా, ఏమైంది?

**కుమార్:** పెళ్ళి కుదిరినట్టే. అమ్మాయి చాలా బాగుంది. నేను కూడా బాగా నచ్చానని చెప్పింది.

**సుందర్:** ఎందుకైనా మంచిది, ఆ అమ్మాయికి కళ్ళు సరిగా కన్పిస్తాయో లేదో ఓసారి కనుక్కో.

## మాడువాసన రాలా

**'ఏం**టీ, ఈరోజు వంటపనిలేదా' పక్కింటి సునీతను పలకరించింది సీత.

'పార్టీకెళ్తున్నాం. అదిసరే కానీ, నేను వంట చేయలేదని మీకెలా తెలిసిందీ' కుతూహలంగా అడిగింది సునీత.

'మాడువాసన ఇంకా రాకపోతేనూ...'

## వన్స్‌మోర్ ప్లీజ్



**పా**వలా బిళ్ల మింగాడు బుజ్జిగాడు. ఇక నేను చచ్చిపోతానేమోనంటూ ఒకటే ఏడుపు. అమ్మ, నాన్నమ్మ ఎంత సముదాయించినా ఏడుపు మానలేదు. ఆఖరికి వాళ్ల నాన్న ఓ ఉపాయం ఆలోచించి, 'నేను తమాషా చేస్తాను చూడు' అన్నాడు.

బుజ్జిగాడు ఆశ్చర్యంగా చూడడం మొదలుపెట్టాడు.

తన చేతిలోని పావలా బిళ్లను లాఘవంగా బుజ్జిగాడి చెవిలోంచి తీసినట్టుగా నటించి, 'ఇదిగో బయటికి వచ్చేసింది' అన్నాడు.

బుజ్జిగాడు తెగ సంబరపడిపోయాడు.

చటుక్కున ఆ బిళ్లనూ మింగేసి అన్నాడు... 'ఇందాకట్లా మళ్లీ చేయి నాన్నా!'




**మద్యం మంచిది కాదని చదివాను, అప్పట్నుంచే మానేశాను... చదవడం.**

– హెన్నీ యంగ్‌మ్యాన్

## మగజాడ్యాలివన్నీ!

**భా**ర్యాభర్తల గొడవలు ఈనాటివి కావు. అయినా సంసారమన్నాక రాజీ పడకా తప్పదు, కలిసి కాపురం చేయకా తప్పదు. ఈ కలహాల కాపురాల నేపథ్యంలో- 'మగవారిలో మాకివి నచ్చవు' అంటూ చాలామంది స్త్రీలు వెల్లడించిన అభిప్రాయాలివీ! విశేషమేమిటంటే ప్రపంచవ్యాప్తంగా దాదాపు ఇదే పరిస్థితి.

- షాపింగ్‌కు వెళ్లాల్సివస్తే ఏడుపుమొహం పెడతారు. కనీసం ఆనందంగా వెంట నడుస్తున్నట్టు నటించడం కూడా చేతకాదు!
- బయటికి వెళ్లాలని రెడీ అవడం మొదలుపెట్టి ఓ అరగంట అవుతుందో లేదో 'ఇంకా ఎంతసేపు' అంటూ విసుక్కోవడం మొదలు పెడతారు.
- టీవీ చూస్తున్నప్పుడు రిమోట్ వాళ్ల చేతిలోనే ఉండాలి! పోనీ, ఉంటే ఉందిలే అనుకుంటే ఎంతసేపూ న్యూస్, స్పోర్ట్స్ ఛానల్స్ పెట్టి విసిగించి చంపుతారు.
- మనసు బాగాలేనప్పుడు దగ్గరగా వచ్చి, ప్రేమగా ఓ మాట చెప్పడమో, ఆర్తిగా దగ్గరకు తీసుకోవడమో చస్తే చేయరు.
- ఓ మంచిమాట చెప్పడమే చేతకాదు. పొద్దస్తమానం 'ఇది బాగాలేదు, అది అలా చేయాల్సింది' అంటూ ఒకటే నస.
- రొమాంటిక్ కబుర్లు చెప్పడం, భార్యను ముద్దుచేయడం హుందాతనం కాదనీ అది భార్యకు లొంగిపోవడమేననీ అనుకుంటారు.
- అనుమానం వాళ్ల జన్మలక్షణం.
- పురుషాహంకారం క్వింటాళ్ల కొద్దీ ఉంటుంది.
- చాక్లెట్లు, పూలు కొనడానికి కూడా ఒకటికి రెండుసార్లు ఆలోచిస్తారు.
- దారి తెలియనప్పుడు 'ఎలా వెళ్లాలి...' అని రోడ్డుమీద ఎవరినైనా అడగాలంటే చిన్నతనంగా ఫీలవుతారు.
- ఎంత పాత డ్రెస్ వేసుకున్నా సరే, ఆశ్చర్యంగా చూస్తూ 'ఎప్పుడు కొన్నావు?' అని అడుగుతారు.
- సరదాగా కబుర్లు చెప్పుకునేటప్పుడు కూడా ఆహా, అలాగా, సరే, ఊఁ... ఇంతకుమించి నోరు పెగలదు.

సాధారణంగానే కోరమీసాలతో జ్వాలా నేత్రాలతో ఉగ్ర రూపంలో ఉంటాడు నృసింహమూర్తి. ఆయనే కరీంనగర్ జిల్లాలోని గంగాధర మండలం నర్సింహుల పల్లెలో ఎనిమిది తలలతో, షోడశ బాహువులతో మరింత గంభీరంగా విశేష రూపంతో దర్శనమిస్తాడు. అంతేకాదు దేవుని గుట్టగా పిలిచే ఇక్కడ పురాతన శైవ, వీరభద్రాలయాలూ కొలువై ఉన్నాయి.



# ఎనిమిది తలల నరసింహుడు!

*కలడంబోధి కలండుగాలి*
*కలడాకాశంబునన్ గుంభినిన్*
*కలడగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్*
*ఖద్యోత చంద్రాత్మలన్...*

అంటూ, ఎక్కడ నీ శ్రీహరి చూపమని అడిగిన తండ్రికి... అగ్ని ఆకాశాలూ... దివారాత్రాలూ అన్నింటా శ్రీహరి ఉన్నాడని చెబుతాడు ప్రహ్లాదుడు. భక్తుడి మాటను నిల బెట్టేందుకు ఓ స్తంభంలోంచి ఆవిర్భవించాడు ఆ భాగవత మూర్తి. భక్తుల పాలిట కొండంత అండగా చెప్పుకునే ఆయన కొండ మీదే... అంతెత్తు రూపంతో వెలిశాడు కోట్ల నర్సింహుల పల్లెలో. అక్కడే రాష్ట్రకూటుల కాలంలో అంటే ఎనిమిదో శతాబ్దంలో కట్టిన లక్ష్మీనృసింహ విశ్వనాథాలయాలతో పాటూ కాకతీయుల కాలంనాటి మల్లికార్జున, సోమనాథ, వీరభద్రాలయాలూ ఉన్నాయి. పురాతన నారసింహాలయం, కోటలు కొలువై ఉండటంతో ఈ ఊరిని కోట్ల నర్సింహుల పల్లె అనీ, అంత మంది దేవతలు ఒక్కచోట కొలువయ్యారు కనుక ఆ కొండను దేవుని గుట్ట అనీ పిలుస్తున్నారు.

### ఎన్నో విశేషాలు...

ఇక్కడ నృసింహాలయంలో మహాలక్ష్మీ సమేతంగా నర్సింహస్వామి వెలిశాడు. అదే దేవాలయ పైకప్పు మీద లోపలివైపు ఎనిమిది ముఖాలూ, పదహారు చేతులతో పెద్ద రాయి మీద చెక్కిన అష్టముఖ నరసింహ స్వామి విగ్రహం దేశంలోనే అరుదైనది. విశాలమైన గ్రానైటు రాయి మీద చెక్కి ఉన్న ఈ రూపంలో ప్రస్తుతం మూడు తలలే స్పష్టంగా దర్శనమిస్తున్నాయి. వైఖానస ఆగమ పరమేశ్వర సంహితలో... స్వామి పదహారు చేతుల్లో ఏమేమి ధరిస్తాడనే వివరణ ఉంటుంది. ఇక్కడ కుడివైపు కింది హస్తంలో హిరణ్యకశిపుని తల ఉంటుంది. రెండు ప్రధాన హస్తాలు దానవుడి పేగులు తీసి మెడలో వేసుకున్నట్టు కనిపిస్తాయి, మరో చేయి రాక్షసుడ్ని కొడుతున్న భంగిమలో ఉండగా మిగతా చేతులు శంఖ చక్రాలు ధరించీ అభయ ముద్రలతో ఉన్నాయి. ఇది ఎల్లోరాలోని దశావతార గుహ-15లోనీ, కాంచీపురంలోని వైకుంఠ పెరుమాళ్ గుడిలోని పోరాట దృశ్యంలోనీ... నరసింహుడి రూపాలను పోలి ఉంటుంది. దశావతార గుహాలయం రాష్ట్రకూట చక్రవర్తి దండిదుర్గుని కాలం (8వ శతాబ్దం)నాటిది కాగా, వైకుంఠ పెరుమాళ్ గుడి నందివర్మ-II కాలం నాటిది (730-795 CE). నందివర్మ రాష్ట్రకూట రాకుమారి రేవను వివాహమాడాడు. బహుశ ఈమె దండిదుర్గుని కూతురు. అంతేకాక రాష్ట్రకూటుల కాలంలో వివిధ దేవాలయాల్లో చెక్కించిన శంఖుచక్రాల రూపాలు ఈ గుళ్లోనూ ఉన్నాయి. అందువల్ల ఈ దేవాల యాన్ని ఆ కాలానికి చెందినదిగా చెబు తున్నారు పురాతత్వ వేత్తలు. ఆ తరవాత ఇక్కడ చెక్కిన పొట్టి స్తంభాలూ, కొన్ని అలం కారాలూ, ద్వారబంధం తదితరాలు కూడా అదే రాజుల కాలంలోనివే. అంటే మొత్తంగా దేవాలయం ఎనిమిదీ తొమ్మిదీ శతాబ్దాల మధ్య కాలంలో నిర్మితమైంది. అయితే కొండపైన గానీ, గ్రామంలోకానీ ఈ దేవా లయ నిర్మాణానికి సంబంధించిన శాసనాలేవీ ఇప్పటి వరకూ దొరకలేదు. శిఖరాగ్రాన నందరాజుల కాలం నాటిదిగా చెప్పే రాతికోట, ధాన్యాగారాల శిథిలాలు కనిపిస్తాయి.

### ఇప్పటికీ నీళ్లు...

నృసింహాలయం ఎదురుగా వాయవ్య దిశలో సీతారామాలయం ఉంది. దేవాలయా నికి పశ్చిమ దిశన పదహారు స్తంభాల మండపం ఉంది. ఇక ఈ గుట్ట మీద వెలసిన విశ్వనాథాలయాన్ని ఆనుకొని సహజ సిద్ధంగా ఓ కోనేరు ఏర్పడింది. ఇందులో నీళ్లు ఇప్పటికీ ఊరుతూనే ఉంటాయి. ఈ దేవాలయాన్ని ఆది శంకరాచార్యులు దర్శించారని చెబుతారు.

### మళ్లీ వెలుగులోకి...

1880వ సంవత్సరంలో రామడుగుకి చెందిన కల్వకోట క్రిష్ణయ్య దేశపాండ్యకి నర్సింహస్వామి కలలో కనిపించి గుడి నిర్మాణానికి ఆదేశించారట. అప్పటి నుంచీ కల్వకోట వంశస్థులే దేవాలయ సేవచేస్తూ ధర్మకర్తలుగా వ్యవహరిస్తున్నారు. ఆలయాలు జీర్ణావస్థకు రావడంతో మళ్లీ వాటి పునరుద్ధ రణ కార్యక్రమాన్ని కల్వకోట రంగారావు కుటుంబం చూసుకుంటోంది. చైత్ర పౌర్ణమి నుంచి మూడు రోజుల పాటు బ్రహ్మోత్స వాలు ఘనంగా జరుగుతాయి..

– కె.కీర్తికుమార్



# రక్తనాళాల మందంతో మతిమరుపు!

రక్తనాళాలు గట్టిబడితే ఆల్జీమర్స్, డిమెన్షియాలతోబాటు మెదడుకి సంబంధించిన ఇతరత్రా సమస్యలూ తలెత్తే అవకాశం ఉందని అమెరికన్ ఫిజియోలాజికల్ సొసైటీకి చెందిన పరిశోధకులు పేర్కొంటున్నారు. సాధారణంగానే వయసు పెరిగేకొద్దీ రక్తనాళాల్లో సాగేగుణం తగ్గి గట్టిగా మారుతుంటాయి. ఫలితంగా గుండె నుంచి రక్తం అన్ని భాగాలకూ వెళ్లడం కాస్త కష్టమవుతుంటుంది. బీపీరోగుల్లోనూ హృద్రోగుల్లోనూ ఈ సమస్య మరీ ఎక్కువగా ఉంటుంది. అయితే ఈ విషయాన్ని పరిశోధనపూర్వకంగా తెలుసుకునేందుకు కొన్ని ఎలుకల్ని ఎంపికచేసి, బీపీతో సంబంధం లేకుండా కాల్షియం క్లోరైడ్ ఇవ్వడం ద్వారా వాటి కెరోటిడ్ రక్తనాళాలు గట్టిపడేలా చేశారు. ఫలితంగా వాటిల్లో జ్ఞాపకశక్తి క్షీణించడంతోబాటు గ్రాహకశక్తి కూడా తగ్గినట్లు తేలింది. ఎందుకంటే రక్తసరఫరా లేకపోవడంతో మెదడులో నరాల పనితీరు కూడా తగ్గింది. అదేసమయంలో ఆల్జీమర్స్ రోగుల మెదడులో అధికశాతంలో కనిపించే ఎమిలాయిడ్ బీటా పెప్టైడ్లు ఆ ఎలుకల మెదడులో ఎక్కువగా ఉండటాన్ని పసిగట్టారు. ఫలితంగా రక్తనాళాల మందానికీ మతిమరుపుకీ మధ్య సంబంధం ఉందని తెలుసుకోగలిగాం అంటున్నారు సదరు పరిశోధకులు. అంతేకాదు, ఈ పరిశోధన ఆధారంగా రక్తనాళాలు గట్టిపడకుండా చేయగల మందుల్ని రూపొందించడం సులభమవుతుందనీ చెబుతున్నారు.



మనం ఎంతో పవిత్రమైనదిగా భావించే తులసిమొక్క అద్భుత ఔషధం అన్న విషయాన్ని ఆయుర్వేద వైద్యం ఎప్పటినుంచో చెబుతోంది. అల్లోపతీ సైతం ఈ విషయాన్ని నిర్ధరిస్తోంది. ముఖ్యంగా శ్వాసకోశవ్యాధులను ఇది అద్భుతంగా నివారిస్తుంది. ఇందులోని యూజెనాల్ అనే రసాయనం క్యాన్సర్, మధుమేహం, హృద్రోగం, ఫంగల్, మైక్రోబియల్, నాడీసంబంధిత వ్యాధుల్ని నిరోధిస్తుందట. ఇంకా మలేరియా, డయేరియా, చర్మరోగాలు, కీళ్లవ్యాధుల్నీ తగ్గించగలదని పేర్కొంటున్నారు.

తులసిమొక్కల్లో చాలానే రకాలున్నాయి. వాటిల్లో ఫాలీఫినాల్స్‌తోబాటు బీటా-కారియోఫిలీన్ అనే రసాయనం అధిక శాతంలో ఉండటంతో అది కీళ్లనొప్పుల్నీ వాపుల్నీ సమర్థవంతంగా నివారించగలదని చెబుతున్నారు పర్డ్యూ విశ్వవిద్యాలయానికి చెందిన పరిశోధకులు.

ఈ మొక్కల నుంచి తీసిన గాఢతైలం వృద్ధాప్యంతో వచ్చే కాలేయ, మెదడు, హృద్రోగ సమస్యల్నీ నివారించగలదని బ్రిటిష్ పరిశోధకులూ పేర్కొంటున్నారు. అంతేకాదు, ఈ తైలాలు ఆస్తమాతోబాటు రకరకాల అలర్జీల్నీ నివారించగలవని తేలింది. ఇవి ఒత్తిడినీ బీపీనీ కూడా తగ్గిస్తాయట.

## తులసి... మంచి ఔషధం!



రోజూ రెండుపూటలా తులసి ఆకుల టీ లేదా కషాయాన్ని తాగడంవల్ల బీపీ నియంత్రణలో ఉంటుందట. జలుబూ దగ్గూ జ్వరమూ వంటి వాటికీ ఈ కషాయం అద్భుతంగా పనిచేస్తుందని నిపుణులు పేర్కొంటున్నారు. ఇంకా ఇది జ్ఞాపకశక్తినీ ఏకాగ్రతనీ కూడా పెంచుతుంది.

నోటిలో పుండ్లున్నా, ఒత్తిడిగా ఉన్నా నాలుగు తులసి ఆకుల్ని నమిలి తినడం వల్ల మంచి ఫలితం ఉంటుంది.

యాంటీబ్యాక్టీరియల్ గుణాలు అధికంగా ఉండే తులసి ఆకుల్ని నేరుగాగానీ ఇతర వంటల్లోగానీ కలిపి తీసుకుంటే జీర్ణశక్తికీ తోడ్పడుతుంది. నులిపురుగులున్నవాళ్లు ఆకుల్ని నూరి తేనెతో తీసుకుంటే మంచి మందులా పనిచేస్తుంది. ఇది రక్తశుద్ధికీ శరీరంలోని మలినాలనూ తొలగించేందుకూ కూడా తోడ్పడుతుంది.

ఈ మొక్కల్లోని ఇథనాల్ మంచి యాంటీఆక్సిడెంట్‌గా పని చేస్తుందనీ మొత్తంగా తులసి రోగనిరోధకశక్తిని పెంపొందిస్తుందనీ తేలింది.



## మంచినిద్రతో క్యాన్సర్ దూరం!

మానవ మెదడులో ఉత్పత్తయ్యే మెలటోనిన్ రొమ్ముక్యాన్సర్ కారణంగా వచ్చే కంతుల్ని నివారిస్తుందని మిచిగన్ స్టేట్ యూనివర్సిటీకి చెందిన పరిశోధకులు పేర్కొంటున్నారు. సాధారణంగా నిద్రలోని దశలను క్రమబద్ధీకరించేందుకు మాత్రమే మెదడు మెలటోనిన్‌ను ఉత్పత్తి చేస్తుంటుంది. అయితే ఆధునిక జీవనశైలి కారణంగా సరైన నిద్రలేకపోవడంతో మహిళల్లో మెలటోనిన్ లోపిస్తుంది. ఫలితంగా రొమ్ము క్యాన్సర్ల ప్రమాదం పెరుగుతోందని సదరు పరిశోధకులు సూత్రీకరిస్తున్నారు. దీన్ని పరిశీలించేందుకు వీళ్లు ప్రయోగశాలలో మూలకణాల నుంచి కంతుల్ని పెరిగేలా చేసి, వాటిని మెలటోనిన్ ప్రభావానికి గురిచేశారు. ఫలితంగా ఆ కంతుల పరిమాణం తగ్గినట్లు గుర్తించారు. దీన్నిబట్టి మెలటోనిన్ రొమ్ముక్యాన్సర్ కంతుల్ని నిరోధించగలదని తేలింది. అంటే క్యాన్సర్ కణాల పెరుగుదలను హార్మోన్లు సహజంగానే నియంత్రిస్తుంటాయని పరిశోధకులు భావిస్తున్నారు. అయితే ఈ కొత్త పరిశోధన కారణంగా చికిత్సను రూపొందించడానికి మరికొంతకాలం పట్టవచ్చు. కానీ దీని ఆధారంగా క్యాన్సర్ కారణాల గురించి మరింత లోతుగా అధ్యయనం చేయగలం అంటున్నారు సదరు పరిశోధకులు.




## టూకీగా...

చిన్నవయసులో టీవీ ఎక్కువగా చూసే పిల్లలు కౌమారదశకు వచ్చేసరికి సమాజంలో కలవడానికి ఇబ్బందిపడుతుంటారనీ నేరాలకూ పాల్పడుతుంటారనీ యూనివర్సిటీ ఆఫ్ మాంట్రియెల్ స్కూల్ ఆఫ్ సైకో ఎడ్యుకేషన్ పేర్కొంటోంది.

చక్కెరశాతాన్ని అదుపులో ఉంచుకోకపోవడంతో మధుమేహవ్యాధి బాధితుల్లో చూపును కోల్పోతున్నవాళ్ల సంఖ్య ప్రపంచవ్యాప్తంగా పెరుగుతోందన్నది నోవా సౌత్ఈస్టర్న్ విశ్వవిద్యాలయ నిపుణుల ఉవాచ.

**మీకు తెలియకుండానే, మీ ఇంటి చుట్టూ కోట్ల రూపాయల వ్యాపారం నడుస్తోంది. మహామహా దిగ్గజాలు మీ గడప మీద గంపెడాశలు పెట్టుకున్నారు. కనుసైగ చేయడమే ఆలస్యం, 'ఆన్ డిమాండ్ హోమ్ సర్వీస్' కంపెనీలు దమ్ బిర్యానీ నుంచి దంత వైద్యం వరకూ... దేన్నయినా మీ ముంగిటికే తీసుకొస్తాయి.**

# మీ ఇంటికొస్తాం... నట్టింటికొస్తాం!




'మీ ఊరికొస్తా...
మీ వీధికొస్తా...
మీ ఇంటికొస్తా...
మీ నట్టింటికొస్తా...
అడ్రస్ మీరు చెప్పినా సరే...
జీపీఎస్‌లో నన్నే వెతుక్కోమన్నా సరే...'

సినిమాల్లో కలెక్షన్లు కురిపించిన డైలాగు, వ్యాపారంలో లాభాల్ని పండిస్తోంది. నిన్న మొన్నటిదాకా...కాస్త ఫీజు ఎక్కువ ఇస్తే, ట్యూషన్ మాస్టారే ఇంటికొచ్చి పాఠాలు చెప్పేవాడు. 'బాబ్బాబూ పుణ్యముంటుంది...' అని బతిమాలితే కిరాణాకొట్టు యజమానే సరుకుల్ని మన అడ్రసుకు పంపేవాడు. అంతే, అంతకుమించి ఏం కావాలన్నా కాళ్లీడ్చుకుంటూ బజారు దాకా వెళ్లాల్సిందే. వరుసలో నిలబడి, ఓపిగ్గా మన వంతు కోసం ఎదురు చూడాల్సిందే. జమానా బదల్‌గయా! ఇక, ఎవరి చుట్టూనో మీరు తిరగాల్సిన పన్లేదు. ఏ సేవలైనా మీ చుట్టే ప్రదక్షిణలు చేస్తాయి.

వేడివేడిగా చికెన్ బిర్యానీ, ఒత్తిడి తగ్గేలా హెర్బల్ మసాజ్...ఏదైనా కావచ్చు.

మీకు ఫేషియల్, మీ కుక్కపిల్లకు క్షవరం ...ఏమైనా కావచ్చు.

దుమ్ముదులిపి పెట్టడానికి పనిమంతుడైన పనోడు, పక్కాగా ముహూర్తం పెట్టడానికి విషయమున్న పురోహితుడు...ఎవరైనా కావచ్చు.

ఒక్క క్లిక్కు చాలు. చెప్పిన సమయానికి వచ్చేస్తారు. చెప్పిన పనులన్నీ చేసేస్తారు. 'ఆన్ డిమాండ్ హోమ్ సర్వీస్' ఇప్పుడో తిరుగులేని వ్యాపార ఆలోచన. జనం అవసరాల్ని అవకాశంగా మలుచుకోడానికి అంకుర సంస్థలు అనేక ప్రయోగాలు చేస్తున్నాయి. ఆ ఐడియాలకు ముచ్చటపడి మహామహా దిగ్గజాలు కోట్ల రూపాయల పెట్టుబడులు పెడుతున్నారు. ఈ వేదిక మీద... రోజుకు ఐదువేల నుంచి పదివేల లావాదేవీలు జరుగుతున్నాయి. ఇప్పటికే, రెండుకోట్ల మంది నగరజీవులు ఇంటి సేవల కోసం రకరకాల వెబ్‌సైట్లలో పేర్లు నమోదు చేసుకున్నారని అంచనా. ఇదంతా ప్రారంభమే. స్మార్ట్‌ఫోన్లు అందరికీ అందుబాటులోకి రావడం, త్రీజీ ఫోర్‌జీ సేవలు చవకైపోవడం...తదితర పరిణామాలతో ఇంటి సేవల పంట పండుతోంది. ఈ విజయంలో సామాజిక, ఆర్థిక, మానసిక కోణాలూ అనేకం.

అవసరాన్ని తీర్చడం..
అహాన్ని సంతృప్తిపరచడం...
ఒకటి భౌతికమైంది, రెండోది మానసికమైంది.
- ఈ రెండు వలల్నీ జంటగా విసిరితే, కస్టమర్ చేప పడితీరాల్సిందే.

అనగనగా కథలో ఓ పెద్దమనిషికి చవకంటే మోజు. చవకగా దొరుకుతుందంటే చంద్రమండలానికైనా బయల్దేరే రకం. ఓరోజు ఏదో వస్తువు కొనుక్కోడానికి దుకాణానికెళ్తాడు. అక్కడి కంటే సంతలోనే చవగ్గా దొరుకుతుందంటే, నేరుగా సంతకెళ్లిపోతాడు. సంతతో పోలిస్తే పొరుగూళ్లో ఇంకా చవగ్గా అమ్ముతున్నారని అక్కడెవరో చెబితే, క్షణం కూడా ఆలస్యం చేయకుండా పక్కూరికి ప్రయాణం అవుతాడు. తీరా అక్కడికెళ్లాక, ఏరుదాటి అవతలి గట్టుకు కనుక చేరుకోగలిగితే...ఫ్రీగా వచ్చేస్తుందన్న మాట వినిపిస్తుంది. మరో ఆలోచన లేకుండా ఏట్లోకి దూకేస్తాడు. తర్వాత, ఆ చవకప్పారావు ఎవరికీ కనిపించలేదు.

కాలం కంటే డబ్బే విలువైన రోజులవి! ఇప్పుడలా కాదే. సాఫ్ట్‌వేర్ కొలువులూ, రెండు జీతాల కుటుంబాలూ ఆర్థిక ఇబ్బందుల్ని అధిగమించేలా చేశాయి. సమస్యంతా సమయంతోనే. ఉరుకులపరుగుల జీవితంలో ఓ గంట సమయాన్ని తమకంటూ మిగుల్చుకోవడం కూడా గగనమైపోతోంది. ఆ కాసేపూ టీవీలో నచ్చిన కార్యక్రమం చూసుకోవచ్చు, పిల్లలతో హాయిగా ఆడుకోవచ్చు, జీవితభాగస్వామితో మాట్లాడుకోవచ్చు. ఆఫీసు పన్లేమైనా మిగిలిపోయి ఉంటే, చకచకా పూర్తి చేసుకోవచ్చు. ఆ కాస్త వెసులుబాటు కోసమే, సమయాన్ని కరెన్సీలో కొలిచి కొనుక్కోడానికైనా సిద్ధపడుతున్నారు. నెలకో అరవై వేలు సంపాదిస్తున్న ఉద్యోగి ఒక రోజు సమయం విలువ రెండువేలు. రోజుకు ఎనిమిది గంటలు పనిచేస్తాడనుకుంటే, గంట విలువ రెండొందల యాభై. ఓ పాతిక రూపాయలు మనవి కాదనుకుంటే పూర్తయిపోయే పనుల కోసం, రెండొందల యాభై ఖరీదు చేసే సమయాన్ని వృథా చేసుకుంటామా? ఎంత మూర్ఖత్వం. అందులోనూ, ఏ పనిమీదో వీధిలోకి వెళ్లడమంటే మన కాలాన్ని ఐస్‌క్రీమ్‌లా కరిగించుకోవడమే. ఒక్కసారి ట్రాఫిక్‌లో చిక్కు



## అంకుర విజయం!

నచ్చిన రుచుల్ని, నచ్చిన రెస్టరెంట్ నుంచి నిమిషాల్లో చేరవేస్తుంది స్విగ్గీ. పట్టుమని మూడేళ్లు కూడా నిండని ఈ అంకుర సంస్థ మార్కెట్ విలువ దాదాపు పదిహేను వందల కోట్ల రూపాయలు. నందన్‌రెడ్డి, శ్రీహర్ష మాజేటి... రాహుల్ జైమినితో కలసి స్థాపించారీ సంస్థని. ఐఐటీ, ఐఐఎమ్, బిట్స్ పిలానీ నేపథ్యాలు ముగ్గురివీ. తొలి ఉద్యోగాల్లో దాచుకున్న డబ్బుతో మొదలైన చిరు వ్యాపారం అనూహ్యంగా విస్తరించింది. స్విగ్గీ మొబైల్ యాప్‌కు ఇప్పటికే పది లక్షల డౌన్‌లోడ్లు జరిగాయి. ఐదొందల పైచిలుకు రెస్టరెంట్లతో ఒప్పందం చేసుకుంది స్విగ్గీ. హైదరాబాద్ సహా ఎనిమిది నగరాల్లో సేవలు అందుతున్నాయి. అమెజాన్ ఇండియా కూడా ఇందులో పెట్టుబడులకు ఉవ్విళ్లూరుతోందని సమాచారం.




## సామాజిక బాధ్యతగా...

ఆ మురికివాడల మహిళలు బట్టలు ఉతికితే మచ్చుకైనా మరక కనిపించదు. అంట్లుతోమితే అద్దంతో పనుండదు. ఇల్లు ఊడిస్తే వంకపెట్టడానికి వీల్లేదు. నిజాయతీలో వాళ్లకు తిరుగే లేదు. లేనిదల్లా...కాస్తంత చొరవ, కాసిన్ని ఇంగ్లీషు ముక్కలు! ఐఐటీ ముంబయి పూర్వ విద్యార్థి జానీరుఘా మురికివాడల పక్కన నుంచి వెళ్తున్న ప్రతిసారీ, 'వీళ్లకోసం నేనేమీ చేయలేనా?' అని తనను తాను ప్రశ్నించుకునేవాడు. అలా ఆలోచించగా ఆలోచించగా ఓ స్పష్టత వచ్చింది. అందులోంచే బిజినెస్ ఐడియా కూడా వచ్చింది. అదే, 'మైదీదీ.ఇన్' ఏర్పాటుకు పురమాయించింది. ప్రస్తుతానికి ముంబయి, థానే నగరాల్లో పనిమనిషి సేవలు అందుతున్నాయి. దాదాపు ఐదొందలమంది మహిళలు మునుపటి కంటే గౌరవంగా బతుకుతున్నారు, మునుపటి కంటే ఎక్కువ సంపాదిస్తున్నారు. జానీ కోరుకున్నదీ అదే!




కున్నామా, బయటికి రావడం అన్నది మన చేతుల్లో ఉండదు. కాలుష్యం, రణగొణ ధ్వనులు, బాధ్యతలేని చోదకులు... ఆ హింస కంటే ఇల్లే నయమనిపిస్తుంది. కోరుకున్నవన్నీ... కాళ్లకు చక్రాలు కట్టుకుని నేరుగా మనింటికే వచ్చేస్తే బావుండనిపిస్తుంది.

సింగిల్ బెడ్‌రూమ్ ఫ్లాటు కావచ్చు, నాలుగు పడకల డూప్లెక్స్ కావచ్చు. ఏదైతేనేం, ఇంటికి చేరుకోగానే మనదైన సామ్రాజ్యంలో అడుగుపెట్టిన భావన కలుగుతుంది. ఆఫీసులో బాసూ, రోడ్డు మీద ట్రాఫిక్ పోలీసూ, ఆసుపత్రిలో నర్సూ... ప్రతి చోటా ఎవరో ఒకరు మనల్ని నియంత్రించాలని చూసేవారే. అదే, ఇంట్లో - మనమే రాజా! కాబట్టే, ఫైవ్‌స్టార్ విలాసం కంటే, మన ఇరుకిరుకు బెడ్‌రూమే మహా సౌకర్యంగా అనిపిస్తుంది.

అన్నిటికీ మించి... మనల్ని వెతుక్కుంటూ ఎవరో వస్తున్నారన్న ఆలోచన అహానికి ఆముదమేసి మర్దనా చేస్తుంది. ఆ ఫీలింగ్ కోసమే, ఓ వంద ఎక్కువైనా ఖర్చు చేస్తాం. కాబట్టే, 'మీ గడపకే డాక్టరు', 'మీ ఇంటికే బిర్యానీ' తదితర ప్రకటనలు కనిపించగానే, 'భలే బావుందే' అనుకుంటాం. మరో ఆలోచన లేకుండా ఆర్డరు ఇచ్చేస్తాం. అందువల్లే, 'గడప సేవ' భవిష్యత్తులో అరవై ఆరువేల కోట్ల రూపాయల పరిశ్రమగా రూపుదిద్దుకోనుంది.

### ఇల్లే 'ప్యారడైజ్'...

నగరజీవి కమ్మని రుచులకు మొహంవాచిపోయాడు. ఇద్దరూ ఉద్యోగులే. ఎవరి పరుగు వారిది. దుకాణం దాకా వెళ్లి సరుకులూ, మార్కెట్ దాకా వెళ్లి పండ్లూ కూరగాయలూ తెచ్చుకునే తీరిక అస్సలు ఉండటం లేదు. ఆ పరిమితిని 'బిగ్ బాస్కెట్' లాంటి సంస్థలు వ్యాపారంగా మార్చుకుంటున్నాయి. అదే రోజు డెలివరీ ఇచ్చేస్తున్నాయి. అంతవరకూ బాగానే ఉంది. సరుకు ఇంటికొచ్చినా వండి వార్చే తీరిక ఎంతమందికి ఉంటుందీ? వండుకున్నా... అన్నం పప్పూ కూరల వరకే! కొత్త రుచులు కావాలంటే, రెస్టరెంట్లకు వెళ్లాల్సిందే. మళ్లీ ఇక్కడో ఇబ్బంది. 'ప్యారడైజ్'కు వెళ్తే వేడివేడిగా బిర్యానీ దొరుకుతుంది. సంతోషమే. కానీ, అక్కడే కూర్చుని 'చట్నీస్'లో అందించే సుతిమెత్తని స్టీమ్డ్ దోసెల్ని రుచి చూడలేం! 'ఉలవచారు'లో రాజుగారి కోడి పులావ్ లాగిస్తూ... షాగౌస్‌లో సర్వ్ చేసే స్పైసీస్పైసీ తంగ్డీ కబాబ్ ముక్కల్ని నంజుకోవాలనుకోవడం భోజన ప్రియులకు తీరని కోరికే. అంటే, ఒకసారి బయటికెళ్తే ఒక రెస్టరెంట్ రుచుల్నే ఆరగించగలం. ఆ పరిమితిని పక్కన పెడుతూ... కోరిన రుచుల్ని కోరుకున్న రెస్టరెంట్ నుంచి తెచ్చి ఇస్తున్నాయి జొమాటో, ఫుడ్‌పాండా లాంటి సంస్థలు. 'అబ్బే! మాకు బయటి భోజనం పడదు. ఇంటి తిండే కావాలి, అదీ మేమే వండుకోవాలి' అని షరతు పెట్టేవారి కోసం. ..'కుక్‌ఫ్రెష్.ఇన్', 'ఈజీకుక్' మొదలైన సంస్థలు సిద్ధంగా ఉన్నాయి. ఏ చికెన్ బిర్యానీయో తినాలని మనసు తహతహలాడుతోంది అనుకోండి... వండుకోడానికి అవ







సర్వమైన పదార్థాలన్నీ కొలతలతో సహా వాళ్లే పంపిస్తారు. దాంతోపాటే, 'చికెన్ బిర్యానీ వండటం ఎలా?' అన్న కరపత్రమూ అందుతుంది. ఇంకేం, నిక్షేపంగా వండుకు తినొచ్చు. 'మేం వండుకోం, హోటల్లోనూ తినం! కానీ కమ్మని ఇంటి భోజనం కావాల్సిందే' అంటూ మడతకాజా పేచీలు పెట్టేవారి కోసమే... ఎవరింట్లోనో ప్రత్యేకంగా వండించి క్యారేజీ పంపే సంస్థలూ వెలుస్తున్నాయి. ఇవన్నీ కాకుండా, 'మా ఇంటికే వచ్చి మాకిష్టమైన వంటలు వండిపెట్టేవారు కావాలి' - అని భీష్మించుకు కూర్చునే వారి కోసం 'ఆన్ డిమాండ్ షెఫ్ సర్వీసులు' ఉండనే ఉన్నాయి. నేరుగా నలభీములే మనింటికొచ్చి, వంటింటిని ఫైవ్‌స్టార్ కిచెన్‌గా మార్చేస్తారు.

### ఇల్లలికి ముగ్గేసి...

వారానికోసారి బాత్‌రూమ్ శుభ్రం చేసుకోవాలి, పదిహేను రోజులకోసారి వంటిల్లు సర్దుకోవాలి, తరచూ సోఫాల దుమ్ము దులపాలి - ఎవరుచేస్తారు ఇన్ని పనులు? భార్యాభర్తలు సమానమే అయినా, భర్త కొంచెం ఎక్కువ సమానం కాబట్టి, అవన్నీ ఆమె మెడకే చుట్టుకుంటాయి. పెండింగ్ ఫైళ్లు దులపడానికే నానా తిప్పలు పడుతుంటే, ఇక ఇల్లేం దులుపుతుంది! మేనేజరుగానో, టీమ్ లీడరుగానో సిబ్బందిని ఉతికి ఆరేయడానికే ఉన్న ఎనర్జీ అంతా ఖర్చయిపోతుంటే, దుప్పట్లేం ఉతుకుతుంది! గృహిణులు ఆ ఇబ్బందుల్ని తప్పించుకునే బ్రహ్మాండమైన ఐడియా ఒకటుంది. చిన్న మెసేజీ చాలు. ఠక్కున వాలిపోతారు. ఇల్లు తుడుస్తారు. టాయిలెట్లు శుభ్రం చేస్తారు. టైల్స్‌ను మెరిపిస్తారు. మూలమూలల్లోని బూజంతా దులిపేస్తారు. బొద్దింకలూ గట్రా కనిపిస్తే పురుగుమందు చల్లుతారు. సోఫాల్నీ పక్కల్నీ శుభ్రం చేస్తారు. పన్లోపనిగా, టప్‌టపమంటూ వృథాగా నీళ్లు పోతున్న కుళాయిల్ని బలంగా బిగిస్తారు, పాడైపోయిన స్విచ్‌బోర్డుల్ని మార్చేస్తారు. గొళ్లాలేమైనా వదులైపోయి ఉంటే అవీ సరిచేస్తారు. వెళ్తూవెళ్తూ పార్కింగ్‌లో దుమ్ము కొట్టుకుపోయిన కారునూ ఓ పట్టు పడతారు. ఒకరే అన్ని సేవలూ చేయవచ్చు. ఏ సేవకు ఆ సేవ అందించే సంస్థలూ ఉన్నాయి. అర్బన్‌క్లాప్, లోకల్ ఓయే, మిస్టర్ రైట్, మిస్టర్.హోమ్‌కేర్, హౌస్‌జాయ్ తదితర అంకురాలు ఈ రంగంలో పేరు తెచ్చుకుంటున్నాయి. ప్రస్తుతానికి వ్యాపారం నగరాలకే పరిమితమైనా, జిల్లా కేంద్రాల దాకా విస్తరించే రోజు ఎంతోదూరం లేదు.



### తక్షణం 'తాత్కాలిక' సేవ...

సగటున నెలకు నాలుగు రోజులు పని మనుషులు చెప్పకుండా మానేస్తారని అంచనా. ఏదో ఓ రోజు పొద్దున్నే సెల్‌ఫోను మోగుతుంది. 'జ్వరంగా ఉందమ్మా! ఈ పూటకు రాలేను..' అంటూ నీరసంగా పని మనిషి స్వరం వినిపిస్తుంది. అప్పటికే సింకులో అంట్లు పేరుకుపోయి ఉంటాయి. బాల్కనీలో మాసిన బట్టలు పోగుపడి ఉంటాయి. చేతిలో ఏ అల్లావుద్దీన్ అద్భుత దీపమో ఉంటే, ఎంత బావుండని అనిపిస్తుంది. దీపాలూ శాపాలూ ఎందుగ్గానీ, 'మెయిడ్ ఆన్ డిమాండ్' కోసం ఇంటర్నెట్‌లో సెర్చ్ చేస్తే సరిపోతుంది. కాకపోతే, ఆ సేవల ఖరీదు కాస్త ఎక్కువే. మీటరేసినట్టు గంటకు ఇంతని లెక్కగడతారు.

దేశంలో వేయి జనాభాకి పద్దెనిమిది కార్లున్నాయి. ఆ పద్దెనిమిది మందిలోనూ, పట్టుమని పదిమందికి కూడా సొంత డ్రైవర్లు ఉండరు. ఉన్నా అత్యవసర పరిస్థితుల్లో అందుబాటులోకి రారు. అలాంటి సమయాల్లో 'డ్రైవ్ యు', 'డ్రైవ్ బడ్' లాంటివి ఆదుకుంటాయి. రిక్వెస్ట్ అందగానే, జీపీఎస్ ద్వారా మన చిరునామా పట్టేసుకుని... వచ్చేస్తారు. గత చరిత్రా, డ్రైవింగ్ నైపుణ్యం పరిశీలించాకే ఒప్పందం కుదుర్చుకుని ఉంటారు కాబట్టి, ధైర్యంగా స్టీరింగ్ అప్పగించవచ్చు. ఇస్త్రీ యూనిఫామ్‌లో వచ్చే ఆ డ్రైవరు, వస్తూవస్తూ వెంట సీటు కవరూ ఫ్లోర్‌మ్యాటూ కూడా తెచ్చుకుంటాడు. 'మీ బండిని పువ్వుల్లో పెట్టి చూసుకుంటాం' అనడానికి అది సంకేతం.

'దర్జీ కుట్టిన బట్టల్లోని దర్జాయే వేరు' అనుకునే వారి సంఖ్యా తక్కువేం కాదు. అలా అనేవారికి కూడా టైలర్ల చుట్టూ తిరిగేంత ఖాళీ ఉండటం లేదు. దీంతో, నప్పినా నప్పకపోయినా రెడీమేడ్ దుస్తుల్నే కట్టుకుంటున్నారు. బెంగుళూరు కేంద్రంగా పనిచేస్తున్న 'అర్బన్ టైలర్'... అలాంటివారికి దర్జీ సేవల్ని గడప దగ్గరే అందిస్తోంది. పిలవగానే వచ్చి కొలతలు తీసుకెళ్లిపోతారు. అతికినట్టుగా కుట్టేసి, వారంపదిరోజుల్లో తెచ్చిస్తారు.

### అందంగా లేనా...

అందం, ఆరోగ్యం... రెండూ మార్కెట్‌ను ఓ ఊపు ఊపగలిగేంత శక్తిమంతమైనవే. అందంగా కనిపించాలనీ ఆకర్షణీయంగా అలంకరించుకోవాలనీ ఎవరికి మాత్రం ఉండదు. అందులోనూ, నగర జీవుల్లో ఆ ఆరాటం ఇంకాస్త ఎక్కువ. అదే సమయంలో బ్యూటీపార్లర్ల చుట్టూ తిరిగేంత వెసులుబాటు ఉండదు. ఇంటికే సౌందర్య నిపుణుల్ని పంపే సంస్థలకు ఆ పరిమితే ఓ వరమైకూర్చుంది. ఫేషియల్, మానిక్యూర్, థ్రెడింగ్, హెన్నా, టాటూ... వగైరా వగైరా సేవలన్నీ మీ మేకప్ టేబులు దగ్గరే జరిగిపోతాయి. మగవాళ్లకైతే క్షవరాలూ గెడ్డాలూ కూడా సిద్ధం. 'గెట్‌లుక్.ఇన్' లాంటి సంస్థలు కపుల్ ప్యాకేజీలూ ఇస్తున్నాయి. అంటే, ఆలూమగలిద్దరూ ఒకేసారి అందాలకు మెరుగులు పెట్టుకోవచ్చు. యోగాచార్యులూ ఫిట్‌నెస్ గురూజీలు కూడా ఇంటికొచ్చే ఆరోగ్య రహస్యాలు బోధిస్తున్నారు. లాండ్రీ సేవలూ ఈ పరిధిలోకి వచ్చేశాయి. మిగతా నగరాల్లో మంచిపేరు తెచ్చుకున్న 'వాష్‌అప్', ఈమధ్యే హైదరాబాద్‌లో కాలుపెట్టింది. 'లోకల్ ఓయె' లాంటి సంస్థలు.. మిగతావాటికి అదనంగా పురోహితులనూ జ్యోతిష్కులనూ వాస్తు

### సెల్లు కష్టాలకు...

సెల్‌ఫోను రిపేరుకొచ్చిందంటే ప్రళయం సంభవించినట్టే. అలాంటప్పుడే 'జస్ట్ లైక్ న్యూ' ఆదుకుంటుంది. మీ పిలుపు అందగానే కంపెనీ ప్రతినిధి ఇంటికొస్తాడు. పాత మొబైల్‌ను తీసుకెళ్లి...రెండ్రోజుల్లో మరమ్మతు చేసి తిరిగి ఇచ్చేస్తాడు. 'అప్పటిదాకా ఎలా? ఆ కొద్దికాలానికి కొత్త ఫోను కొనలేం కదా' అంటారా? ఏం ఫర్వాలేదు. వెళ్తూవెళ్తూ... తాత్కాలికంగా వాడుకోడానికో సెల్‌ఫోను చేతిలో పెడతాడు. మరమ్మతుకు మూడు నెలల వారెంటీ ఉంటుంది. బెంగుళూరు పరిసరాల్లో 'డ్రైవోజాయ్'... బైకులకు సంబంధించి ఇలాంటి సేవల్ని అందిస్తోంది. ఇంటికే మెకానిక్‌ను పంపుతోంది.

### అవీ-ఇవీ-అన్నీ...

పొద్దున్నే మందులేసుకోవాలి. కుదర్లేదు. ఆఫీసుకు వచ్చేశాం. ఇంటిదాకా వెళ్లి మందుల డబ్బా ఎవరు తెచ్చిస్తారు? శివార్లలో ఉంటున్న బాబాయి అమెరికా వెళ్తున్నాడు. ఆయనతో అమ్మాయికి ఆవకాయ జాడీ పంపించాలి. అంతదూరం వెళ్లి ఇచ్చిరావడానికి వీలుపడదు. ఏదీ పరిష్కారం? ఇలాంటి చిన్నాచితకా పనుల్ని చేసిపెట్టడానికి కూడా హైదరాబాద్‌లో ఓ సంస్థ ఉంది. పేరు...'వీడెలివర్'. ఇప్పటిదాకా లక్ష డెలివరీలు ఇచ్చినట్టు వ్యవస్థాపకులు చెబుతున్నారు.

నిపుణులనూ కూడా బుక్ చేసి పెడుతున్నాయి. 'అర్బన్ క్లాప్' న్యాయ సేవలనూ గడప దగ్గరికే చేరవేస్తోంది. 'దొరకునా ఇటువంటి సేవ...' అని ఆశ్చర్యంగా పాడుకోవాల్సిన పనేలేదిప్పుడు. ఏ సేవ అయినా కచ్చితంగా దొరికితీరుతుందీ, నేరుగా ఇంటికే వచ్చితీరుతుందీ!

## హలో డాక్టర్!

ఎటుచూసినా మందుల వాసనలు, అక్కడక్కడా మూలుగులు, అప్పుడప్పుడూ ఏడుపులు... చాలామంది, రోగానికంటే ఆసుపత్రి వాతావరణానికే ఎక్కువ భయపడతారు. ఆ మనోజాడ్యాన్ని తొలగించుకుంటే, రోగం దానంతట అదే దార్లోకి వస్తుంది. ఇదంతా జరగాలంటే ఇల్లే వైద్యశాల కావాలి. రోగ నిర్ధారణ పరీక్షల కోసం, ఇంటికే వచ్చి నమూనాల్ని తీసుకెళ్లే పద్ధతి ఎప్పటి నుంచో ఉంది. ఫిజియోథెరపీ సేవలూ ముందు నుంచే ఉన్నాయి. తాజాగా హెచ్ఐవీ పరీక్షలతో పాటూ చిన్నాపెద్దా టెస్టులన్నీ ఇంటికే వచ్చేస్తున్నాయి. దంత చికిత్సల్లాంటివి కూడా మన పడక గదిలోనే కానిచ్చేస్తున్నారు. తప్పనిసరైతే ఇంటినే ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌గా మార్చేస్తున్నారు. నైటింగేల్ హోమ్ హెల్త్ పద్దెనిమిది నెలల్లోనే... ఖాతాదారుల సంఖ్యను పాతిక వేలకు పెంచుకుందంటేనే అర్థం అవుతుంది, ఆదరణ ఎలా ఉందో! సాధారణ వైద్యుల వరకూ పర్వాలేదు. కార్డియాలజిస్టులూ న్యూరాలజిస్టులూ తదితర పెద్ద డాక్టర్ల అపాయింట్‌మెంట్ దొరకడం మాత్రం మహాకష్టం. ఏ తెల్లవారుజామునో వెళ్లి టోకెన్ తీసుకోవాలి. హైదరాబాద్ కేంద్రంగా పనిచేస్తున్న 'కాల్‌హెల్త్' ఆ బాధ లేకుండా చేస్తోంది. ఇ-కన్సల్టేషన్‌లో వైద్య నిపుణుడు కంప్యూటర్ తెరమీద ప్రత్యక్షమై.. మనం చెప్పేదంతా వింటాడు. తగిన చికిత్సలు సూచిస్తాడు. అవసరమైతే, వైద్య సహాయకుల్ని ఆ సమయానికి మనింటికి పంపుతారు. అప్పటికప్పుడు చేయాల్సిన పరీక్షలూ గట్రా వాళ్లే చూసుకుంటారు. మొబైల్‌ఫోన్ ద్వారా నిపుణుల్ని సంప్రదించే వెసులుబాటు ఉంటుంది. డాక్టరుతో ఆన్‌లైన్‌లో ఛాట్ చేసుకునే అవకాశాన్నీ కల్పిస్తున్నారు. ఇరవైశాతం భారతీయులు అరవై పైబడినవారే కావడంతో, ఇలాంటి వ్యాపారాలకు భవిష్యత్తులో ఢోకా ఉండదు.



## శునక సేవలు...

పుత్రోత్సాహం లాంటిదే శునకోత్సాహం కూడా! ఆ ప్రేమానుభూతిని మాటల్లో చెప్పలేం. సమస్యంతా వాటి ఆలనా పాలనా గురించే! ఓపికున్నా లేకపోయినా పొద్దున్నే కాలకృత్యాలకు తీసుకెళ్లాలి. మనం చేసినా చేయకపోయినా వాటికంటూ స్నానం చేయించాలి. మనం చేయించుకున్నా చేయించుకోకపోయినా, వాటికి మాత్రం క్షవరం చేయించాలి. ఆ కార్యక్రమాలన్నీ పూర్తయ్యేసరికి... మనిషి బతుకు కంటే, కుక్కజన్మే నయమనిపిస్తుంది. అన్నిబాధలెందుకు, ఆ పనులన్నీ ఎవరో ఒకరికి పురమాయిస్తే సరి. గడపదాకా వచ్చి, ఆతరహా సేవలందించే సంస్థలు బోలెడన్ని. నొయిడాలోని 'క్లీన్ క్యాట్' అయితే, రసాయనాల జాడలేని 'హెర్బల్ బాత్' చేయిస్తోంది. అంతేనా, చెవుల్ని శుభ్రం చేస్తుంది, గోళ్లు కత్తిరిస్తుంది. చిన్నచిన్న వ్యాయామాలూ చేయిస్తుంది. ఎందుకంటే, ఊబకాయం మనుషుల్నే కాదు మూగజీవాల్నీ తీవ్రంగా వేధిస్తోంది. 'మా పప్పీకి బొత్తిగా జ్ఞానం లేకుండా పోయింది. తెలిసినవాళ్లెవరో ఇంటికొస్తే, తలుపు దగ్గర వదిలేసిన చెప్పుల్ని చెరుకుగడల్లా నమిలి పడేసింది. ఎంత నామోషీగా అనిపించిందో. వేయిరూపాయలు పెట్టి మొన్ననే కొన్నారట పాపం!' అంటూ అమాయక శునకాన్ని తిట్టుకోవడమూ తప్పే. ఆ జాతి స్వభావమే అంత! వీలైతే, నలుగురి మధ్యా ఉన్నప్పుడు ఎలా మెలగాలన్నది శిక్షణ ఇప్పిస్తే సరిపోతుంది. ఆ సేవలూ గడప దగ్గరికే వచ్చేస్తాయి. శునకాలకు నడత పాఠాలు చెప్పడానికి చేయితిరిగిన డాగ్ సైకాలజిస్టులు సిద్ధంగా ఉంటారు. శునకో భిన్నరుచిః - అన్నట్టు, పెంపుడు కుక్కల కోసం రుచికరమైన ఆహారాన్ని తెచ్చిచ్చే అంకుర సంస్థలూ పుట్టుకొస్తున్నాయి.

## పెద్ద మార్కెట్టే...

ఈ వ్యాపారానికి సాంకేతికతే పెద్ద అండ. రవాణా రంగంలో ఉబర్, ఓలా అనుసరించే పరిజ్ఞానాన్నే ఇక్కడా అమలు చేస్తున్నారు. గ్లోబల్ పొజిషనింగ్ సిస్టమ్ - వ్యాపారినీ వినియోగదారుడినీ నేరుగా కలిపేస్తుంది. ఎవరు ఎక్కడున్నారో తెలుస్తుంది, ఎంత సేపట్లో గమ్యానికి చేరిపోతారన్నదీ అర్థమైపోతుంది. చేతిలో నైపుణ్యం ఉన్నా... రకరకాల కారణాలతో పూర్తిస్థాయి ఉద్యోగాలు చేయలేకపోతున్న నర్సులూ డ్రైవర్లూ బ్యూటీషియన్లూ... గడప సేవల్ని పార్ట్‌టైమ్ వ్యాపకంగానూ ఎంచుకోవచ్చు. ఇప్పటికిప్పుడు నిపుణుల్ని ఇంటికే రప్పించుకోవడం అన్నది ఖరీదైన వ్యవహారమే అయినా, దీర్ఘకాలంలో పోటీ పెరిగి ఫీజులు తగ్గే ఆస్కారం ఉంది. ప్రత్యేకించి నగరం నడిబొడ్డున కార్యాలయాలు తెరవాల్సిన పనుండదు కాబట్టి, అద్దెల గొడవ ఉండదు. ఓ ఐదేళ్ల సమయంలో... ఒక్క వైద్య రంగంలోనే ఫీజులు ముప్పైశాతం దాకా పడిపోవచ్చని నిపుణుల అంచనా.

చిన్నాచితకా వృత్తి నిపుణుల ప్రవర్తన తరచూ ఇబ్బంది కలిగిస్తూ ఉంటుంది. చాలామందికి పద్ధతిగా మాట్లాడ్డం కూడా రాదు. శిక్షణతో అలాంటి చిన్నపాటి లోపాల్ని సవరించడం అసాధ్యమేం కాదు. 'ఆన్ డిమాండ్ హోమ్ సర్వీస్' సంస్థలు ఆ ప్రయత్నమూ చేస్తున్నాయి.

ఏ కార్పొరేట్ విజయగాథను తిరగేసినా... విలాసాల్నీ వైభోగాల్నీ అందించే వ్యాపారాలతో పోలిస్తే.... ఓ సామాజిక సమస్యకు బలమైన పరిష్కారాన్ని అందించే ఆలోచనలే కలకాలం నిలుస్తాయి. ఆ ప్రకారంగా చూసినా గడప సేవలకు తిరుగులేదు. మరేదో విప్లవాత్మక ఆవిష్కరణ వచ్చేదాకా దీనిదే హవా!

★ ★ ★

ఇంతకీ 'ఇంటికే సేవలు' అన్న పక్కా వ్యాపార ఆలోచనకు మూలాలు ఎక్కడున్నాయి? ఆవిష్కర్తలు ఎవరు?

ఐఐటీ? ఐఐఎమ్? ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ?
-ఇవేవీ కాదు.

జాక్‌మా? స్టీవ్‌జాబ్స్? సీకే ప్రహ్లాద్?
-వీళ్లెవరూ కాదు.

ఆ ఆలోచన అచ్చంగా ముంబయి డబ్బావాలాలది!

సరిగ్గా నూట ఇరవై అయిదేళ్ల నాటిది!!

## చినచేపా పెదచేపా...

**ఏటా సగటున వంద స్టార్టప్స్ ఈ రంగంలోకి వస్తున్నాయి. పెద్దచేపలు చిన్నచేపల్ని మింగినట్టు పెద్దసంస్థలు చిన్న సంస్థల్ని కలిపేసుకుంటున్నాయి. ఇప్పటికే కొన్ని విలీనాలు జరిగిపోయాయి. అమెజాన్, అలీబాబా తదితర దిగ్గజాలు కూడా పెట్టుబడులతో కొత్తరక్తాన్ని ప్రోత్సహిస్తున్నాయి. కార్పొరేట్ భీష్ముడు రతన్ టాటా 'అర్బన్ క్లాప్'లో పెట్టుబడులు పెట్టారు. క్రికెటర్ యువరాజ్ సింగ్ 'వ్యోమో' అనే సౌందర్య సేవల సంస్థకు అండగా నిలిచారు. పేటీఎమ్ ఫేం విజయ్‌శేఖర్‌శర్మ నియర్.ఇన్‌కు నిధులు సమకూర్చారు. క్వికర్ సంస్థ 'సలోసా'ను సొంతం చేసుకుంది.**



చింపిరి జుట్టూ, గుబురుగా పెరిగిన గడ్డం, ఎండిపోయిన డొక్కలూ, ఒంటిని అంటిపెట్టుకున్న ఓ లుంగీ... చూడగానే ఎలాంటి ఆదరణా లేని అభాగ్యుడిలా, బతికిచెడ్డ పేద రైతులా కనిపిస్తారు అలోక్ సాగర్. కానీ ఐఐటీలో చదివి, అమెరికాలో పీహెచ్‌డీ చేసి, ఆర్బీఐ మాజీ గవర్నర్ రఘురామ్ రాజన్‌కు ప్రొఫెసర్‌గా పాఠాలు చెప్పింది అతడే అంటే నమ్మగలరా..!

# అమెరికాలో చదివిన ఐఐటీ ప్రొఫెసరీయన!

కొన్నాళ్ల క్రితం మధ్యప్రదేశ్‌లో గోడొంగరీ అనే అసెంబ్లీ స్థానానికి ఎన్నికలు జరిగినప్పుడు గిరిజనుల పైన సర్వే చేయడానికి అధికారులు ఆ ప్రాంతానికి వెళ్లారు. ఒక్కో ఊళ్లో గిరిపుత్రుల గురించి ఆరా తీస్తుంటే వాళ్లకు సైకిల్ మీద చొక్కా లేకుండా తిరుగుతున్న ఓ పెద్ద మనిషి కనిపించాడు. అతడి మొహం చూస్తే గిరిజనుడు కాదని వాళ్లకు అర్థమైంది. వాళ్లకు సంబంధం లేని వ్యక్తి అక్కడేం చేస్తున్నాడనే అనుమానం కలిగింది. తానూ వాళ్లలో ఒక్కడినేనని ఆ పెద్దాయన పదే పదే చెప్పినా అధికారులకు నమ్మకం కలగలేదు. ఆయనకు సంబంధించిన రేషన్ కార్డు, ఓటర్ కార్డు లాంటి ధ్రువ పత్రాలేవైనా ఉంటే చూపించమని నిలదీశాక కానీ అసలు విషయం బయట పడలేదు. ఆ గిరిపుత్రుల్లో ఒకడిగా కలిసిపోయి జీవిస్తోన్న ఆ పెద్దాయన పేరు అలోక్ సాగర్. అతడి తండ్రి ఐఆర్ఎస్ అధికారి. తల్లి ఫిజిక్స్ ప్రొఫెసర్. దిల్లీ ఐఐటీ నుంచి ఎలక్ట్రికల్ ఇంజినీరింగ్, పీజీ పూర్తి చేసిన మేధావి. ఆపైన టెక్సాస్‌లోని హ్యూస్టన్ యూనివర్సిటీ నుంచి పీహెచ్‌డీ పట్టా కూడా అందుకున్నారు. భారత్‌కు తిరిగొచ్చి దిల్లీ ఐఐటీలో పదేళ్లపాటు ప్రొఫెసర్‌గా పనిచేశారు. అలా అలోక్ దగ్గర పాఠాలు నేర్చుకున్న ఎంతో మంది ప్రముఖుల్లో మాజీ ఆర్బీఐ గవర్నర్ రఘురాం రాజన్ కూడా ఉన్నారు. ఆయన నేపథ్యాన్ని ధ్రువీకరించుకున్నాక అక్కడి అధికారులకు ఆశ్చర్యంతో నోట మాట రాలేదు.

### *ఉద్యోగానికి రాజీనామా*

ఐఐటీలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న సమయంలో ఓసారి ఏదో పరిశోధన పనిమీద మధ్యప్రదేశ్‌లోని మారుమూల ప్రాంతానికి వెళ్లారు అలోక్. అక్కడ ప్రపంచంతో సంబంధం లేకుండా, కనీస సదుపాయాలకు కూడా దూరంగా జీవిస్తోన్న గిరిజనుల దీనస్థితి ఆయన్ని కలవరపెట్టింది. వాళ్లకోసం ఏదైనా చేయాలని అనిపించినా, బయటి వ్యక్తులను అంత త్వరగా గిరిజనులు నమ్మలేరు. అందుకే అలోక్ ఎంత అడిగినా వాళ్లకేం కావాలో, అక్కడి సమస్యలేంటో చెప్పలేదు. గిరిజనుల్లో ఒకడిగా మారితేనే వాళ్లు తనని ఆహ్వానిస్తారని అలోక్‌కి అనిపించింది. ఐఐటీలో పాఠాలు తాను కాకపోతే మరొకరు చెబుతారనీ, కానీ వాళ్ల జీవితాలని మార్చడానికి తాను పూనుకోకపోతే ఇంకొకరు వస్తారన్న గ్యారంటీ లేదనీ అనిపించింది. దాంతో మరో ఆలోచన లేకుండా దిల్లీ వెళ్లి ఉద్యోగానికి రాజీనామా చేసి 32ఏళ్ల క్రితం కట్టుబట్టలతో కొచాము అనే గిరిజన గ్రామానికి చేరుకున్నారు. అప్పట్నుంచీ వాళ్లు తినేదే తింటూ, వాళ్లతోనే ఉంటూ పిల్లలకు చదువు చెబుతూ, ఊళ్లో చిన్న చిన్న సమస్యలను పరిష్కరిస్తూ ఆ అమాయకులకు పెద్దదిక్కుగా అక్కడే ఉండిపోయారు అలోక్. బయటి వాళ్లెవరైనా గ్రామానికి వచ్చినా తన నేపథ్యం బయట పెట్టేవాడు కాదు. ఇప్పుడుకూడా, ఎన్నికల అధికారులు తనను ఆ ప్రాంతం వదిలి వెళ్లిపోమని ఆదేశించడంతో, తప్పనిసరై వాటిని బయట పెట్టాల్సి వచ్చిందంటారు అలోక్.

### *దుస్తులు మూడు జతలే...*

గిరిజనుల్లో ఒకడిలా ఉండాలంటే వేషభాషలూ వాళ్లకు తగ్గట్లే ఉండాలి. పాతికేళ్లుగా అలానే జీవిస్తున్నారు అలోక్. ఒక సైకిలు, మూడు జతల దుస్తులూ... ఇవే ఆ గూడెంలో ఆయనకున్న ఆస్తి. ఆ సైకిల్ మీదే సుదూర ప్రాంతాలకు వెళ్లి రకరకాల విత్తనాలను సేకరించి నామమాత్రపు ధరకు వాటిని గిరిజనులకు విక్రయించడమే జీవనోపాధిగా మార్చుకున్నారు. అక్కడి వాళ్లు మాట్లాడే రెండు మూడు యాసల్లో ప్రావీణ్యం సంపాదించి, అలానే సంభాషించడం అలవాటు చేసుకున్నారు. ప్రభుత్వ పథకాల ద్వారా గిరిజనులకు అందే అన్ని రకాల సౌకర్యాలూ పూర్తిగా అందేలా చూస్తూ, వాళ్ల జీవన ప్రమాణాలను పెంచుతూ అండగా నిలబడ్డారు.

### *యాభైవేల మొక్కలు...*

గిరిజనులతో పాటు ప్రకృతిపైనా అలోక్‌కు మమకారం ఎక్కువే. ఆ ప్రేమతోనే ఇన్నేళ్లలో తానుంటోన్న బీటుల్ జిల్లాలో యాభై వేలకు పైగా మొక్కలు నాటారు. ఆయన గిరిజన గ్రామాల్లో అడుగుపెట్టాక బడికెళ్లకుండా పని బాట పట్టే చిన్నారుల సంఖ్య బాగా తగ్గిపోయింది. వ్యవసాయం చేసుకునే గిరిజనులకు నాణ్యమైన విత్తనాలను ఎంచుకోవడంలో సహాయ పడుతున్నారు. ఖాళీ సమయంలో పెద్దలకు చదువుతోపాటు పరిశుభ్రత పాఠాలూ బోధిస్తున్నారు. పౌష్టికాహార లోపాన్ని గిరిజన గ్రామాల నుంచి దూరం చేయడానికి శ్రమిస్తున్నారు. మొత్తంగా ప్రభుత్వానికీ గిరిపుత్రులకూ మధ్య పాతికేళ్లుగా వారధిలా పనిచేస్తున్నారు అలోక్. అతడి సోదరుడు ఇప్పటికీ దిల్లీ ఐఐటీలో ప్రొఫెసర్‌గా పనిచేస్తుండటం విశేషం. ఎన్నికల సమయంలో అలోక్ గిరిజనుల మనసు మార్చి తమకు వ్యతిరేకంగా ఓటేయిస్తారని స్థానిక నాయకులు భయపడ్డారు. అందుకే అతడిని పోలీసుల సాయంతో అక్కడి నుంచి పంపించే ప్రయత్నం చేశారు. కానీ వాళ్లకా హక్కులేదని అతడికి తెలుసు. ఎక్కువగా ఒత్తిడి పెడితే గిరిజనులూ ఊరుకోరనిపించి పోలీసులూ వెనక్కితగ్గారు. 'ప్రజలకు మంచి చేయడానికి పెద్ద పెద్ద డిగ్రీలతో పనిలేదు. అందుకే వాటితో నాకు అవసరం లేదు. ఎప్పటికీ నా గురించి బయట పెట్టకూడదనుకున్నా, కానీ కుదరలేదు' అంటారు అలోక్. 'మేము గాంధీని చూడలేదు, మాకు తెలిసిన గాంధీ అలోక్ సారే' అంటాడు అనురాగ్ అనే ఓ స్థానిక సామాజికవేత్త. పోలిక సరైనదే అనిపిస్తోంది కదూ..!



# ఉపకారం

– రామిశెట్టి విజయలక్ష్మి

ఇల్లంతా అగర్‌బత్తీల సువాసన పరచుకుని ఉంది. పూజ పూర్తయిపోయి, హారతి ఇస్తున్న సూచనగా... గంట చప్పుడు వినబడుతోంది. హారతి కళ్ళకద్దుకుని దేవుడి గదిలో నుండి బయటకు వస్తూ, బెడ్‌రూమ్ వంక చూసింది విమల.

ఆనందరావు ఇంకా బెడ్ పైనే ముసుగు తన్ని ఉండటం చూసి "ఏమండీ... ఏమండీ..!" అని పిలిచింది విమల.

"అబ్బా! ఏమిటే ఆ కేకలు" ముసుగు తీయకుండానే అన్నాడు ఆనందరావు.

"ఈరోజు సరుకుల కోసం బజారుకి వెళదామన్నాను కదా. లేచి త్వరగా తెమలండి" అంటూ వంటగది వైపు నడిచింది విమల. ఇక లెగవక తప్పదని అయిష్టంగానే లేచి రెడీ అయ్యాడు ఆనందరావు.

తనూ రెడీ అయి, ఇంటికి తాళంవేసి కారు ఎక్కుతుండగా "విమలగారూ..!" అన్న పిలుపుకి వెనక్కి తిరిగి చూసింది విమల. ఎదురు ఫ్లాట్ రాధిక, వాళ్ళమ్మాయి నిలబడి ఉన్నారు.

"ఏమిటి రాధికగారూ" అంటూ దగ్గరకి వెళ్ళింది విమల.

"ఏమీ అనుకోకపోతే, మా అమ్మాయిని కాస్త స్కూలు దగ్గర దింపి వెళతారా? మావారు ఊళ్ళో లేరు. నాకు జ్వరంగా ఉంది" అని మొహమాటపడుతూ అడిగింది రాధిక.

అప్పుడు చూసింది రాధిక వంక... రేగిపోయిన జుట్టూ, లోతుకు పీక్కుపోయిన కళ్ళూ... పాపం నీరసంగా ఉంది.

"అయ్యో, దానిదేం ఉందండీ... అలాగే. అటువైపేగా వెళుతున్నాం... అంతలా అడగాలా?"

"రామ్మా" అంటూ ఆ అమ్మాయిని పిలిచింది విమల. పెద్ద పుస్తకాల బ్యాగు మోస్తూ గబగబా విమల దగ్గరికి వచ్చింది ఆ అమ్మాయి.

ఇదంతా గమనిస్తున్న ఆనందరావు అసహనంగా, కోపంగా ఊగిపోతున్నాడు. "ఏంటి విమలా, ఇప్పుడు ఆ అమ్మాయిని మనం ఎందుకు డ్రాప్ చేయాలి? మనం పనిమీద వెళుతున్నాం కదా! ఇప్పటికే లేట్ అయింది" అంటూ విరుచుకుపడ్డాడు.

"ఇప్పుడేమయిందని..? ఇంకో పావుగంట లేట్ అవుతుంది, అంతేకదా. మనకేం అర్జంటు పనులు లేవుగా. ట్రెయిన్ క్యాచ్ చేయాలా, బస్ క్యాచ్ చేయాలా? పదండీ" అని భర్త ప్రవర్తనకి విసుక్కుంటూ అమ్మాయితోపాటు కారెక్కింది విమల. తన మాట నెగ్గనందుకు కోపంగా, రాష్‌గా డ్రైవ్ చేస్తున్నాడు ఆనందరావు.

కాస్త కూడా హెల్పింగ్ నేచర్ లేని తన భర్త గురించే ఆలోచిస్తోంది విమల. నెలరోజుల క్రితం కూడా ఆనందరావు ఇలానే చేశాడు.

"విమలా, ఒక్కసారి తొందరగా రామ్మా" అని ఏడుస్తూ వచ్చింది పక్కింటి కాంతమ్మగారు. పెద్దావిడ అలా ఏడుస్తూ వచ్చేసరికి కంగారుగా ఆవిడతో వాళ్ళ ఇంట్లోకి నడిచింది విమల.




"చూడమ్మా, ఈయన ఒళ్ళు జ్వరంతో కాలిపోతోంది. టాబ్లెట్ వేసినా తగ్గలేదు. ఇప్పుడు పిలిచినా పలకటంలేదు. నాకు చాలా భయంగా ఉందమ్మా" అంటూ కొంగుతో కన్నీళ్ళు వత్తుకుంటోంది కాంతమ్మగారు. అల్లారు ముద్దుగా పెంచుకున్న ఒక్కగానొక్క కొడుకు అమెరికాలో సెటిలయ్యాడు. ముందు చూపుతో ఆస్తిగా ఈ ఫ్లాట్ కొని 'అమ్మానాన్నల కోసమే' అని అందంగా అబద్ధమాడి, ఈ ఇంట్లో ముసలి తల్లిదండ్రులను ఒంటరిగా వదిలేసి, తమ బాధ్యత అయిపోయిందన్నట్లు చేతులు దులిపేసుకున్నారు వాళ్ళ కొడుకూ కోడలు.

వాళ్ళని ఆ పరిస్థితిలో చూసిన విమల చలించిపోయింది. ఒక్క ఉదుటున ఇంట్లోకి వచ్చి జరిగింది ఆనందరావుకి చెప్పింది.

"పెద్దాయనని హాస్పిటల్‌కి తీసుకువెళ్ళాలి తొందరగా పదండి. ఆయన పరిస్థితి ఏమీ బాగాలేదు పాపం" అంది విమల.

అంతే... ఇంతెత్తున మండిపడ్డాడు ఆనందరావు. "నీకు మరీ చాదస్తం ఎక్కువై పోతోంది విమలా. ఇప్పుడు ఆయనని మనం హాస్పిటల్‌కి తీసుకువెళ్ళాలా... మనకి వేరే పనేమీ లేదా? ఎప్పుడు చూసినా ఎవరెవరికో ఏదో చేయాలంటావు.

పై ఇంటి అబ్బాయిని 'ఎగ్జామినేషన్' సెంటర్‌లో దింపమంటావు. పక్కవాళ్ళ పసిపాపకి అర్జంటుగా పాలడబ్బా తెమ్మంటావు. మొన్న నీ ఫ్రెండ్ మెట్ల మీద జారిపడిపోయి కాలు ఫ్రాక్చర్ అయితే కూడా మనమే హాస్పిటల్‌కి తీసుకెళ్ళాం. ఎవరిదారి వాళ్ళు చూసుకుంటారు. మధ్యలో నువ్వెందుకు అన్నీ నీ నెత్తిన వేసుకుంటావు?"

"చూడండీ" ఆనందరావు మాటలకి బ్రేక్ వేస్తూ అంది విమల.

తల తిప్పి విమల వంక అదే కోపంతో చూశాడు ఆనందరావు. ఆనందరావు మాటలు అసలు రుచించలేదు విమలకి.

"చూడండీ... వాళ్ళవాళ్ళ పనులు వాళ్ళు చేసుకోలేకా, ఆత్మాభిమానంలేకా కాదండీ... మనల్ని అడగటం. తప్పనిసరి పరిస్థితుల్లో అభిమానం చంపుకుని మనల్ని అడుగుతారు. ఎప్పుడో ఏడాదికి ఒక్కసారి ఏ అనాథ శరణాలయంలోనో అన్నం వడ్డిస్తే సరిపోదండీ... మీ గొప్పతనం చూపించటానికి. మీ బర్త్‌డే రోజు ఓ జత బట్టలు ఓ పేదవాడికి అందించి, ఫొటో ఫేస్‌బుక్‌లో పెట్టడం కాదండీ. మన కళ్ళముందు కష్టమొచ్చినవాళ్ళని ఆదుకుని మనకు తోచినది, మన పరిధిలో ఉన్న చిన్నచిన్న సహాయాలైనా చేయాలి. దానివలన మనం నష్టపోయేదేమీ లేదు, ఈ చిన్నచిన్న సహాయాలే అవతలివాళ్ళకి ఎంతో సంతోషాన్ని కలిగిస్తాయి. పైగా మనకీ ఎంతో తృప్తి కలుగుతుంది. మనం మనుషులమనిపించుకుంటాం. ఇలాంటి అవసరాలు రేపు మనకు రావని గ్యారంటీ ఉందా?" అంటూ భర్తని నిలదీసింది విమల.

పెద్దాయన్ని హాస్పిటల్లో జాయిన్ చేసి,

ఆయన కోలుకునే వరకు అండగా ఉన్న విమల చేతులు పట్టుకుని కళ్ళనీళ్ళ పర్యంతమైంది కాంతమ్మగారు. ఆయన కోలుకున్నందుకు చాలా సంతోషపడింది విమల.

ఈ ఆలోచనల మధ్య రాధికవాళ్ళ అమ్మాయిని స్కూల్లో దింపి, షాపింగ్ చేసుకుని ఇంటికొచ్చారు.

'ఈయన ఎప్పుడు మారతాడో' అని విమలా, 'దీనికెందుకొచ్చిన తంటా ఇది' అని ఆనందరావూ ఆలోచిస్తూనే ఉన్నారు.

ఊరికి కాస్త దూరంగా ఉన్న శివాలయంకి వెళ్ళాలని విమల కోరిక. ఎలాగో భర్తని ఒప్పించి, ఓ సాయంకాలం గుడికి బయలుదేరారు ఇద్దరూ. అక్కడి ప్రశాంత వాతావరణం చూసి ఎంతో సంతోషపడిపోయింది విమల. స్వామికి అర్చన చేయించుకుని తిరుగు ప్రయాణమయ్యారు. చీకటిపడింది.

"ఏమండీ, అటు చూడండి. ఏదో యాక్సిడెంట్ అయినట్లుంది" గట్టిగా అరిచింది విమల.

"ఆс... అవును, అయినట్లుంది" తాపీగా అన్నాడు ఆనందరావు.

"అలా తాపీగా అవును అంటారేమిటండీ. .. కాస్త కారు స్లో చేయండి" అంది.

స్లో చేశాడు ఆనందరావు.

"అయ్యో, అటు చూడండి- ఆయనెవరో... రక్తం కారిపోతోంది, బాధతో కొట్టుకుంటున్నాడు. ప్రాణం ఉంది. త్వరగా హాస్పిటల్‌కి తీసుకువెళదాం. కారు ఆపండి" ఆత్రుతగా అరుస్తూ అంది విమల.

చాలా ఆశ్చర్యంగా విమల వంక చూశాడు ఆనందరావు.

"నీకేమైనా పిచ్చిపట్టిందా? ఎవరో, ఎలా జరిగిందో... చూసీచూడనట్లు వెళ్ళిపోకపోతే... పోలీసులూ ఎంక్వయిరీలూ... లక్ష ప్రశ్నలు. మనకు ఎందుకొచ్చిన గొడవ. పోలీసులు మనమే చేశామని అన్నా అంటారు. నోరు మూసుకుని పద" అని అరుస్తూ కారు ఆపకుండా స్పీడ్ పెంచి ఇంటికి తెచ్చాడు ఆనందరావు.

ఆ దృశ్యం కళ్ళల్లో మెదులుతుంటే... ఆ రాత్రి కనురెప్పలు మూతపడలేదు విమలకి.

పొద్దుననగా వెళ్ళిన కొడుకు ఆకాష్ రాత్రి వరకూ ఇంటికి రాలేదు. లేటుగా వచ్చిన ఆకాష్ స్నానం చేసి సోఫాలో చతికిలపడ్డాడు. వచ్చిన దగ్గర నుండి ఒక్క మాట కూడా మాట్లాడలేదు. ఎందుకో దిగులుగా కనిపిస్తున్న కొడుకు వాలకం గమనిస్తూనే ఉంది విమల.

"భోజనం చేద్దువుగాని రారా" అని పిలిచింది.

"నాకు ఆకలిగా లేదమ్మా!" అన్నాడు ఆకాష్ ముక్తసరిగా.

"ఏంరా, అలా ఉన్నావ్? పొద్దున వెళ్ళి ఇప్పుడు వస్తున్నావు, ఏం జరిగింది?" సోఫాలో పక్కన కూర్చుంటూ అడిగింది విమల.

కాసేపు మౌనంగా ఉన్న ఆకాష్ నెమ్మదిగా అన్నాడు "అమ్మా, నీకు నా ఫ్రెండ్ పవన్ తెలుసుగా... వాళ్ళ నాన్నగారు చనిపోయారమ్మా."

"అవునా... పాపం ఏమయింది, ఏం జరిగింది?" వాళ్ళ ఫ్యామిలీతో కాస్త పరిచయం ఉంది కనుక ఆశ్చర్యపోతూ అడిగింది విమల.

"ఇంత జరిగితే మాకెందుకు చెప్పలేదురా? నేనూ నాన్నా వచ్చేవాళ్ళం కదా. పాపం, వాళ్ళ అమ్మగారూ పిల్లలూ ఎలా ఉన్నారు?" బాధపడుతూ అడిగింది.

"నిన్నరాత్రి శివాలయం రోడ్డులో ఏదో లారీ గుద్దేసిందట. అక్కడ ఎక్కువ ట్రాఫిక్ ఉండదు కదా, ఎవరూ చూసి ఉండరు.



ఎవరైనా త్వరగా హాస్పిటల్‌కి తీసుకెళ్ళి ఉంటే బతికేవారంటమ్మా. రక్తం ఎక్కువగా పోవటంవల్ల చనిపోయారంట. పాపం వాళ్ళ ఫ్యామిలీ దిక్కులేనిదైపోయిందమ్మా" ఏడుస్తూ చెబుతున్నాడు ఆకాష్.

ఇంకా ఏదో చెబుతున్న కొడుకు మాటలు విమల చెవులకి సోకటంలేదు. నిన్నరాత్రి దృశ్యం కళ్ళముందు కదులుతుంటే... చేష్టలుడిగి అలాగే ఉండిపోయింది.

ఫోన్ మోగటంతో చదువుతున్న పుస్తకం పక్కనపెట్టి సెల్ ఆన్ చేసింది విమల. "హలో అమ్మా!" అవతల నుండి ఆకాష్ మాట్లాడుతున్నాడు.

కొడుకు చెప్పేది పూర్తిగా వినకుండానే ఒక్క పరుగున బయటకు వచ్చి ఆటో ఎక్కింది.

హాస్పిటల్ ముందు ఆటో దిగుతూ, చేతికి దొరికిన నోటు ఆటోవాలా చేతిలో కుక్కి చిల్లర కోసం చూడకుండా పరుగు పరుగున లోపలికి వచ్చింది. ఆమె కళ్ళు ఎర్రగా ఉబ్బిపోయాయి.

'ఐసియూ' ముందు ఆకాష్, పవన్ మాట్లాడుకుంటూ కనబడ్డారు. కొడుకుని పట్టుకుని బావురుమంది విమల.

విమల కాస్త తేరుకున్న తరవాత, ఆనందరావుకి యాక్సిడెంట్ ఎలా జరిగిందో... టైమ్‌కి పవన్ హాస్పిటల్లో జాయిన్ చేసి ఎలా ప్రాణం కాపాడాడో... వివరంగా చెప్పాడు ఆకాష్.

"నాన్న ఔట్ ఆఫ్ డేంజర్ అమ్మా" తల్లిని కాస్త ఓదార్చాడు ఆకాష్.

"అంకుల్‌కి ఏమీ కాదు ఆంటీ, ఇప్పుడు బాగానే ఉన్నారు" అంటున్న పవన్‌ని దగ్గరకు తీసుకుని హత్తుకుంది విమల.

మరునాడు కాస్త తేరుకున్నాడు ఆనందరావు. బెడ్ పక్కనే ఉన్న భార్యనీ, కొడుకునీ చూసిన ఆయన కళ్ళల్లో సంతృప్తి. చివరగా నిలబడ్డ పవన్‌ని చూసి దగ్గరకు రమ్మని పిలిచి తన పక్కనే కూర్చోబెట్టుకుని పవన్ చేతులు పట్టుకున్నాడు ఆనందరావు. ఉద్వేగంతో ఆయన గొంతు పూడుకుపోతోంది.

"బాబూ పవన్, నన్ను క్షమించమని కూడా అడగలేను. మానవత్వం లేకుండా ప్రవర్తించాను. నా అజ్ఞానంతో మీ నాన్న మరణానికి పరోక్ష కారణమయ్యాను. మీ కుటుంబానికి తీరని అన్యాయం చేశాను. అయినా... అయినా... కూడా నువ్వు నన్ను కాపాడావు. నా ప్రాణం నిలిపావు. ఈ అపకారికి ఉపకారం చేసి పెద్ద గుణపాఠం నేర్పావు. నా కళ్ళు తెరిపించావు" అంటున్న ఆనందరావు కళ్ళు పశ్చాత్తాపంతో వర్షించాయి.

"ఏమండీ, ఇంతసేపూ ఎక్కడికి వెళ్ళారు, చెప్పి వెళ్ళొచ్చుగా?" చెప్పులు విప్పి లోపలికి వస్తున్న ఆనందరావుని కాస్త కంగారుగా అడిగింది విమల.

"ఏం లేదు విమలా! అలా బయటకు వెళ్ళాను. ఒక బామ్మగారు నడుస్తూ నడుస్తూ ఏదో రాయి తగిలి పడిపోయారు. కాలు బెణికింది. ఆవిడ నడవలేకపోతున్నారు. తోడు కూడా ఎవరూ లేరు. అందుకని... అడ్రస్ అడిగి ఆటోలో ఆవిడని వాళ్ళ ఇంట్లో దిగబెట్టి వచ్చాను. ఒక్కరే వెళ్ళొద్దని చెప్పినా తోచక బయటికి వచ్చారంట బామ్మగారు. వాళ్ళవాళ్ళు 'థ్యాంక్స్ అండీ' అంటూ ఎంతో సంతోషపడ్డారు తెలుసా! నాకూ చాలా సంతోషంగా అనిపించింది- నేను మంచిపని చేశానని" అని చెబుతున్నాడు ఆనందరావు.

తన భర్తలో వచ్చిన మార్పుని చూసి సంతోషంతో తబ్బిబ్బై కళ్ళు చెమర్చాయి విమలకి. తను కోరుకున్న మార్పు అదే!

# పుణె కోసం పూనావాలా 100 కోట్లు

'సీరమ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియా'... వ్యాక్సిన్‌లు తయారు చేసే ఈ సంస్థ విలువ రూ.4000 కోట్లు. కంపెనీ సీయీవో ఆదర్ పూనావాలా. ఇంటి పేరులోనే ఆ నగరాన్ని పెట్టుకున్నందుకో మరేమో పుట్టి పెరిగిన పుణె నగరాన్ని పరిశుభ్రమైన నగరంగా తీర్చిదిద్దాలని నిర్ణయించుకున్నారు. అందుకోసం ఏకంగా రూ.100 కోట్లు ఖర్చు చేస్తున్నారాయన.






ఇప్పుడు పుణె నగరంలో ప్రధాన రోడ్లకు ఇరువైపులా చెత్త డబ్బాలూ, రోడ్లపైన చెత్తను తరలించే అధునాతన ట్రక్కులూ, వాటితో పాటు రోడ్లను శుభ్రపరిచే సరికొత్త యంత్రాలూ దర్శనమిస్తున్నాయి. ఈ మార్పునకు కారణం వ్యాపారవేత్త ఆదర్ పూనావాలా. 'ఆదర్ పూనావాలా క్లీన్ సిటీ మూవ్‌మెంట్' పేరుతో గతేడాది స్వచ్ఛ పుణె కార్యక్రమం మొదలుపెట్టారు ఆదర్. ప్రభుత్వ-ప్రైవేటు భాగస్వామ్యంతో నడుస్తోన్న ప్రాజెక్టు ఇది. 'పుణె మున్సిపల్ కార్పొరేషన్', 'నోబుల్ ఎక్స్ఛేంజ్ ఎన్విరాన్మెంట్ సొల్యూషన్స్'ల భాగస్వామ్యంతో దేశంలో పుణెను సుందర నగరాల్లో ఒకటిగా తీర్చిదిద్దడమే లక్ష్యంగా దీన్ని ప్రారంభించారు. 'రోడ్ల మీద చెత్తాచెదారం కనిపించినపుడు దానికో పరిష్కారం చూపాలనుకుంటాం. కానీ అంతలోనే అది మన పరిధిలో లేని విషయంగా భావించి ముందుకు పోతాం. నాకు మాత్రం అది నా పరిధిలోని అంశమే అనిపించింద'ని చెబుతారు ఆదర్. 2015లో ప్రారంభమైన ఈ కార్యక్రమాన్ని మూడేళ్లపాటు కొనసాగిస్తారు. మొత్తం వ్యయంలో పుణె కేంద్రంగా పనిచేస్తోన్న 'సీరమ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియా' సీఎస్ఆర్‌లో భాగంగా ఖర్చు చేస్తున్నది రూ.10కోట్లు కాగా, పూనావాలా కుటుంబం రూ.90 కోట్లు కేటాయించింది. మూడేళ్లలో ఈ ప్రాజెక్టును స్వయంచాలిత వ్యవస్థగా తీర్చిదిద్దాలనుకుంటున్నారు.

### మూడు దశల్లో...

'క్లీన్ సిటీ మూవ్‌మెంట్' ప్రాథమిక దశలో పుణె నగరపరిధిలోని 30-40 కి.మీ.దూరంలో ప్రతి 100 మీటర్లకీ తడి, పొడి చెత్త సేకరణకు జత చెత్త డబ్బాలను ఏర్పాటుచేశారు. వాటిని ప్రత్యేకంగా డిజైన్ చేసిన ట్రక్కుల్లో శుద్ధి చేసే కేంద్రాలకు చేరవేస్తారు. రెండో దశలో జులై నాటికి ఈ రోడ్ల పరిధిని 300కి.మీ. వరకూ విస్తరించారు. దాంతో నగరంలో మూడో వంతు చెత్తను సేకరించగలుగుతున్నారు. వీటితోపాటు రోడ్లను శుభ్రం చేయడానికి ఇంగ్లాండ్, జర్మనీ లాంటి దేశాల్లో ఉపయోగించే వాక్యూమ్ క్లీనర్లలాంటి యంత్రాల్నీ తెప్పించారు. కొన్ని వాహనాల్లో చెత్తను అక్కడికక్కడే శుద్ధి చేసే సాంకేతికతా ఉంది. మూడో దశలో ఈ ఏడాది చివరకు నగర పరిధిలోని 1000కి.మీ. మేర ఈ సేవల్ని విస్తరించనున్నారు. తద్వారా నగరమంతా ఈ కార్యక్రమం అమలైనట్టవుతుంది. ఈ కార్యక్రమంలో భాగంగా పనిచేసే సిబ్బందికీ వీరే జీతాలిస్తున్నారు. త్వరలో ముంబయికీ ఈ సేవల్ని విస్తరించాలని చూస్తున్నారు.

### చెత్తతో ఇంధనం

వ్యర్థాలను ప్రాథమిక దశలోనే తడి, పొడిగా విభజించడంవల్ల వాటి పునఃవినియమ ప్రక్రియను సులభతరం చేస్తున్నారు. అంతేకాదు చెత్తను ఎప్పటికప్పుడు శుభ్రపరుస్తూ, నగర శివార్లలో కుప్పలుగా నిల్వచేసే ప్రక్రియకూ ముగింపు పలకాలని చూస్తున్నారు. తద్వారా వందకుపైగా ఎకరాల భూమిని మిగతా అవసరాలకు కేటాయించవచ్చంటారు ఆదర్. ఇప్పటివరకూ ఈ కార్యక్రమానికి దాదాపు రూ.40కోట్లు ఖర్చుచేశారు. వీరు సేకరించిన తడి చెత్తని 'నోబుల్ ఎక్స్ఛేంజ్' కంపెనీ శుద్ధి చేస్తూ జీవ ఇంధనాన్ని ఉత్పత్తిచేస్తోంది. పొడి చెత్త రీసైక్లింగ్ బాధ్యతను మాత్రం ప్రస్తుతానికి పుణె మున్సిపల్ కార్పొరేషన్ చేపడుతోంది. అక్కడా ఆధునిక పద్ధతుల్లో శుద్ధిచేయడంలో మార్గనిర్దేశం చేస్తున్నారు. 'తడి చెత్త వల్ల డెంగీ, మలేరియా లాంటివీ త్వరగా వ్యాప్తిచెందుతాయి. వాయు కాలుష్యం కూడా పెరుగుతుంది. వ్యర్థాలు భూగర్భ జలాల్లో కలిస్తే ఇంకెన్నో సమస్యలు. అందుకే దీనిపైన ముందు దృష్టి పెట్టాం. పుణెలో రోజూ 1700 టన్నుల తడి చెత్త తయారవుతోంది. అందులో ఎక్కువ ఆహార వ్యర్థాలే. ఆ చెత్తను వేరుగా సేకరించి శుద్ధి చేస్తే నగర పరిశుభ్రతతోపాటూ పర్యావరణానికీ, ప్రజా ఆరోగ్యానికీ మేలు చేసినట్టవుతుంది. అందుకే, ప్రజలూ దీన్లో భాగమవ్వాలి' అనేది ఆదర్ మాట. ఈ కార్యక్రమంలో గృహ సముదాయాల్నీ, హోటళ్లనీ, కార్యాలయాల్నీ భాగం చేసుకొని వెళ్తున్నారు.




సాధారణంగా వాణిజ్యవేత్తలు తమ సంస్థల సేవా కార్యక్రమాల్లో భాగంగా కోట్ల రూపాయల్ని ఖర్చు చేస్తుంటారు. కానీ వారి సమయాన్నీ, యాజమాన్య విధానాల్నీ మాత్రం అక్కడికి తీసుకువెళ్లరు. ఆదర్ మాత్రం కేవలం డబ్బు కేటాయించి ఊరుకోకుండా తగినంత సమయాన్ని కేటాయిస్తూ చెత్త డబ్బాల ఎంపిక, వాహనాల కొనుగోలు, ఉద్యోగుల పనితీరు, చెత్తను శుద్ధి చేసే విధానం... ఇలా ప్రతి అంశాన్నీ పరిశీలిస్తూ ప్రణాళికలు వేస్తారు. తద్వారా తక్కువ బడ్జెట్‌లోనే మంచి పాలనా దక్షతతో పనిచేస్తే ఎలాంటి ఫలితాలు రాబట్టవచ్చో చూపడానికి ప్రయత్నిస్తున్నారు.

'మేం రోడ్లు శుభ్ర పరుస్తున్నాం. ఇంకొకరు టాయిలెట్లు కట్టించడం, మరొకరు మొక్కలు నాటడం... ఇలా చేస్తే మొత్తంగా పుణె రూపురేఖలు మారిపోతాయి' అంటారు ఆదర్. తర్వాత పుణె స్ఫూర్తితో మిగతా నగరాలూ పనిచేస్తాయంటారు. త్వరలో మురుగు నీటిని శుద్ధి చేసి పుణె నీటి అవసరాలను తీర్చే ఆలోచనా ఉందంటారు ఆదర్. పుట్టి పెరిగిన నగరం కోసం ఇంత చేస్తున్న ఆదర్ ఉదారత... ఎందరికో ఆదర్శం.



దట్టమైన అడవులూ, పాలనురగలను తలపించే జలపాత ధారలూ, సహ్యాద్రి పర్వత శ్రేణుల అందాలకూ నెలవు ఆదిలాబాద్ జిల్లా. ఇన్నాళ్లూ తన ఒంపుసొంపులతో చూపరులను కట్టిపడేసిన అక్కడి గాయత్రి జలపాతం తొలిసారి ప్రపంచస్థాయి సాహస క్రీడలకు ఆతిథ్యం ఇవ్వనుంది. మూడు రోజుల పాటు అక్కడ జరగనున్న వాటర్‌ఫాల్ ర్యాపెల్లింగ్ ప్రపంచకప్ సన్నాహక పోటీలు సాహసికులతో పాటు వీక్షకులకూ వినోదాన్ని పంచనున్నాయి.

# ధీవరా... సాహసం చేయరారా!

వందల అడుగుల ఎత్తునుంచి నేలకు జాలువారే జలపాతాల్ని కొందరు అలా ఎంతసేపైనా చూస్తూ కూర్చుంటే చాలనుకుంటారు. ఇంకొందరు దాని ధారలో తడవాలని ఆశపడతారు. సాహసికులు మాత్రం అమాంతం ఆ జలపాతానికి ఎదురెళ్లి పైకెక్కాలని ఉవ్విళ్లూరుతారు. అలాంటి వాళ్లందరినీ ఒక దగ్గరకి చేర్చేవే వాటర్‌ఫాల్ ర్యాపెల్లింగ్ పోటీలు. ఐదేళ్లుగా అడ్వెంచర్ క్లబ్ ఆఫ్ తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ ఆధ్వర్యంలో దేశంలోని వివిధ ప్రాంతాల్లో నిర్వహిస్తోన్న ఈ సాహస క్రీడలకు తొలిసారి ఆదిలాబాద్ జిల్లా, ఇచ్చోడ మండలంలోని గాయత్రి జలపాతం వేదిక కానుంది. దాదాపు 250 అడుగుల ఎత్తు నుంచి లోయలోకి దూకే జలధారలకు ఎదురెళ్తూ పైకెక్కడం, తాడు ఆధారంగా జలపాతం పైనుంచి కిందకు దిగడం, కళ్లకు గంతలు కట్టుకొని నీటి కొండను అధిరోహించడం... ఇలా జలపాతం చుట్టూ తిరిగే వాటర్‌ఫాల్ ర్యాపెల్లింగ్ ప్రపంచకప్ సన్నాహక పోటీలు అక్టోబరు ఏడో తేదీ నుంచి అక్కడ జరగనున్నాయి.

### తొలిసారి ఆదిలాబాద్‌లో...

ఆంధ్రప్రదేశ్‌లోని అరకులోయ సమీపంలోని కటికి జలపాతం ఈ ఏడాది చివర్లో జరిగే వాటర్‌ఫాల్ ర్యాపెల్లింగ్ ప్రపంచకప్‌కు వేదిక. ఔత్సాహికుల శక్తి సామర్థ్యాలను పరీక్షించి ఆ పోటీలకు అర్హులను ఎంపిక చేసేందుకు సన్నాహక పోటీలను ఆదిలాబాద్‌లో నిర్వహిస్తున్నారు. మొత్తం మూడ్రోజుల పాటు పన్నెండు విభాగాల్లో జరిగే సాహస క్రీడల్లో భారత్‌తో పాటు పొరుగు దేశాల నుంచీ దాదాపు మూడొందల మంది పాల్గొననున్నారు. ఒక్కో బృందానికి పన్నెండు మంది చొప్పున పాతికకు పైగా బృందాలు తమ సామర్థ్యాన్ని పరీక్షించుకుంటాయి. పిల్లలూ, ఆడవాళ్లు, మగవాళ్లకు విభాగాల వారీగా పోటీలు జరుగుతాయి. యాభై ఏళ్లు పైబడ్డ వారికీ క్రీడల్లో చోటుంటుంది.

### జనారణ్యానికి దూరంగా...

తెలంగాణ అడ్వెంచర్ క్లబ్ ఎప్పటికప్పుడు రకరకాల సాహస క్రీడలను నిర్వహిస్తూ ఉంటుంది. వాటికి సంబంధించిన సమాచారం, దరఖాస్తులూ జిల్లాల్లోని నెహ్రూ యువజన కేంద్రాల్లో అందుబాటులో ఉంటాయి. అడ్వెంచర్ క్లబ్ వెబ్‌సైట్ (adventureclubofts. com), ఫేస్‌బుక్ పేజీ (facebook.com/ wrwc2016/)ల్లోని



ప్రకటనల ఆధారంగా పోటీలకు నమోదు చేసుకోవచ్చు. అభ్యర్థుల మానసిక, శారీరక దృఢత్వాన్ని పరీక్షించాకే పోటీలకు అర్హుల్ని ఎంపికచేస్తారు. అన్ని వయసుల వాళ్లకూ ఆయా విభాగాల్లో పాల్గొనే అవకాశం ఉంటుంది. 'జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో సాహస క్రీడలను నిర్వహించేందుకు గాయత్రి జలపాతం అనుకూలంగా ఉంటుంది. సాహసాలకు ఉవ్విళ్లూరే యువతను ప్రోత్సహించడానికే ఏటా ఈ పోటీలను నిర్వహిస్తున్నాం. విదేశాల నుంచీ చాలామంది క్రీడాకారులు మన దగ్గరికి వస్తున్నారు. వీటి వల్ల ఒకప్పుడు విహార యాత్రలకే పరిమితమైన ప్రాంతాలు ఇప్పుడు సాహస యాత్రలకూ అనువుగా మారుతున్నాయి' అంటారు అడ్వెంచర్ క్లబ్ డైరెక్టర్ రంగారావు (93948 83999). ప్రపంచకప్ పోటీలకు సంబంధించి దరఖాస్తు చేసుకోవాల్సిన విధానం, ఇతర వివరాల కోసం ఆయన్ని సంప్రదించొచ్చు. పోటీలు కాకుండా సరదాగా ఆ సాహసక్రీడల్ని సాధన చేయాలనుకునేవాళ్ల కోసం అక్టోబరు 5, 6 తేదీల్లో అక్కడే ప్రత్యేక ఏర్పాట్లూ ఉంటాయి.

ఇచ్చోడకు ఆదిలాబాద్ నుంచి 30 కి.మీ, నిర్మల్ నుంచి 46కి.మీ దూరం. అక్కడి నుంచి 5కి.మీ దూరంలో ఉన్న మేడిగూడ చేరుకుని, దానికి 3కి.మీ దూరంలో ఉన్న గుండివాగు గ్రామానికి వెళ్లాలి. ఆపైన మరో రెండు కిలోమీటర్లు ప్రయాణిస్తే జనారణ్యానికి దూరంగా అడవులూ, కొండల మధ్య అందంగా ఒదిగిపోయిన గాయత్రి జలపాతం దర్శనమిస్తుంది. పోటీల పుణ్యమా అని ఈ ప్రాంతానికి పర్యటకులు రావడంవల్ల తమకూ ఆదాయం పెరుగుతుందన్నది స్థానికుల మాట. నిత్యం చల్లగా ఉండే జలపాత పరిసరాలు సాహసికుల విన్యాసాలతో వేడెక్కనున్నాయి. మరి ఆ ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించడానికీ, ఉత్కంఠను అనుభవించడానికీ మీరూ సిద్ధమా..!



– *తేరాల రంజిత్ కుమార్*, ఈనాడు, ఆదిలాబాద్

పగటి పూట
ఎన్ని అందాలైనా
ఉండొచ్చు గాక.
కానీ చీకటి రాజ్యానికి
అందాల రాజైనా
రాణైనా వెలుగే.
అలాంటి కాంతి మరిన్ని
వన్నెలను అద్దుకుని
వెలిగితే ఆ అందాన్ని
చూసేందుకు రెండు
కళ్లేం సరిపోతాయి..?
ఈ కారణం
చాలదూ లైట్లు ఇంటి
అలంకరణలో భాగం
అయిపోవడానికి...

# అందం వెలిగిపోతోంది








## అవాక్కయ్యారా..?

వెలుగుతున్న మనిషి చీకట్లో గోడను చీల్చుకుని దూసుకొస్తుంటే, స్పైడర్ మ్యాన్, కారు, బంతీ అన్నీ గోడను పగలగొట్టి వెలుగుతూ బయటికొస్తున్నట్లుంటే... అవాక్కవకుండా ఎవరైనా ఉంటారా... అందుకే, ఈ మార్వెల్ ఎవెంజర్స్ త్రీడీ వాల్ లైట్లకు ఇప్పుడు మార్కెట్లో ఉన్న క్రేజ్ అంతా ఇంతా కాదు. ప్లగ్‌లో గుచ్చితే వెలిగే ఈ లైట్లతో పాటు త్రీడీ వాల్ స్టిక్కర్లు కూడా వస్తాయి. గోడ పగిలినట్లు కనిపించే ఈ స్టిక్కర్లను ప్లగ్ హోల్డర్ చుట్టూ అతికించి ప్లగ్‌కు లైటుని గుచ్చితే చాలు... పగిలిన గోడలోంచి స్పైడర్‌మ్యాన్, కారు, బంతీలాంటి వివిధ రూపాలు వెలుగుతూ బయటికి వచ్చినట్లనిపిస్తుంది.

## వెలుగులు విరబూసె




పువ్వులే అందంగా ఉంటాయి. ఇక, అవి మిరుమిట్లు గొలిపే కాంతుల్ని వెదజల్లితే ఆ సౌందర్యం చీకటిని సైతం చూడచక్కగా మార్చేయదూ... 'ఆర్నమెంటల్ ఫ్లవర్ ప్లగ్ లైట్ల' పేరుతో వస్తున్న ఈ లైట్లను చూస్తే ఎవరైనా ఈ మాటల్ని ఒప్పుకోవాల్సిందే. మామూలు ప్లగ్‌లైట్లకే చిన్న కుండీ అందులో మొక్కా, పువ్వులూ ఉన్నట్లు తీర్చిదిద్దిన ఇవి చూడ్డానికి అంత బాగుంటాయి మరి. ఇక, 'లోటస్ ఫ్లవర్ టేబుల్ ల్యాంప్'ని చూస్తే సినిమాలోని గ్రాఫిక్కులోలా విచ్చుకున్న తామర పువ్వులోంచి కాంతి వెలువడుతున్నట్లు అనిపిస్తుంది. 'సిరామిక్ తులిప్ వేజ్ ల్యాంప్' అయితే, మరీ ప్రత్యేకం. పగటిపూట నిజమైన వేజూ అందులో తులిప్ పువ్వులా ఉండే ఈ వేజ్ వెలుగుతున్నప్పుడు కూడా సహజమైన పువ్వులానే కనిపించడం విశేషం. ఏమైనా పువ్వు పువ్వే, వెలుగు వెలుగే..!






## కాంతి సిత్రాలు



లైట్లు రకరకాల రూపాల్లో ఉండడం తెలిసిందే. కానీ వెదజల్లే వాటి కాంతులు విభిన్న రూపాల్లో కనిపించడం ఇంకా ఆకర్షణీయంగా ఉంటుంది. ఈ మాగీడీల్ స్పైరల్ ఎల్ఈడీ వాల్ లైట్లు, ఇన్నోరీ ఎల్ఈడీ వాల్ స్కోన్స్ అలాంటివే. చిన్నసైజు డబ్బాల్లా ఉండే వీటి లోపల రంగు రంగుల లైట్లు ఉంటాయి. డబ్బాలకు వేరు వేరు డిజైన్లలో రంధ్రాలు ఉండడంతో లోపలున్న కాంతి ఆయా రూపాల్లో గోడమీద పడి ఓ అందమైన డిజైన్‌ను ఆవిష్కరిస్తుంది. ఇవుంటే ఇల్లు ప్రతిరోజూ కళకళలాడిపోతుందనడంలో సందేహమేముందీ..?






## ప్రియమైన కానుక

మనసైనవారితో సంతోషంగా గడిపిన క్షణాలు ఎవరికైనా చాలా విలువైనవి. అలాంటి సంఘటనల్ని గుర్తుచేసే ఫొటోలను ఎన్నిసార్లు చూసినా సంతోషం రెట్టింపే అవుతుంది. ఆ జ్ఞాపకాల్ని అందమైన కానుకగా మార్చి ఆత్మీయులకు అందిస్తే... ఇంకెంత ఆనందపడతారో ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. అందుకోసమే ఇప్పుడు లైట్లు కూడా పర్సనలైజ్‌డ్ గిఫ్టులుగా మారిపోతున్నాయి. అమెజాన్, ఫెర్న్స్ అండ్ పెటల్స్, ద గిఫ్ట్స్ ఫ్యాక్టరీ... లాంటి చాలా కంపెనీలు లైట్ల మీద మనకు నచ్చిన ఫొటోలను ప్రింటు చేసి ఇస్తున్నాయి. అందం, ఆనందం కలగలిస్తే ఎంత బాగుంటుందో మీరూ చూడండి.

## నీడ కూడా అందమే

షాడో ఎల్ఈడీ లైట్లు... ఇవి వెలుగునివ్వడం మాత్రమే కాదు, రకరకాల ఆకర్షణీయమైన రూపాల్లో ఇంటికే అందాన్ని తెస్తాయి. ఇంకా ప్రత్యేకమైన విషయమేంటంటే వాటి నీడతోకూడా చూపరులను ఆకట్టుకుంటాయి. అవును, పువ్వులూ జంతువులూ కీటకాల్లా ఉండే ఈ వాల్ లైట్ల వెనుక గోడకు తగిలించే భాగం కాస్త పెద్దగా ఉండి, గోడకూ లైటుకూ మధ్య దూరం వచ్చేలా చేస్తుంది. దాంతో లైటు వెలిగినపుడు నీడ కూడా వెనుకవైపున మరింత పెద్దగా పడుతుంది. ఇవి, వేరు వేరు రూపాల్లో ఉండడంతో చూడ్డానికీ బాగుంటాయి.





## వింతైన మెరుపు

లైటంటే లైటులానే ఎందుకుండాలి... పక్షి గూడూ అందులో గుడ్లలానూ, నీళ్లపంపూ అందులోంచి కారే నీరులానూ, ఒక బక్కెట్లో నుంచి మరో బక్కెట్లోకి పోస్తున్న పాలలానూ ఎందుకుండకూడదూ అనుకున్నట్లున్నారు కొందరు సృజనకారులు. నెస్ట్ ల్యాంప్, లిక్విడ్ ఎల్ఈడీ లైట్స్ పేరుతో ఇలా రకరకాల విద్యుద్దీపాలను రూపొందించేస్తున్నారు. కళ్లప్పగించేసేంత ప్రత్యేకంగా ఉన్నాయి కదూ!






# ఈ ఫ్యాషన్ యమ క్రేజీ



**గోడకు రంగులేస్తుంటే జారిన చుక్కలన్నీ చొక్కా మీద పడినట్లూ... పిల్లలు పెయింటింగ్ గీస్తుంటే రంగు ఒలికి గౌను మీద కారినట్లూ... ఎవరో కోపం వచ్చి పెయింట్ బ్రష్‌ను ప్యాంటు మీద విదిలించినట్లూ... ఉన్న ఈ చుక్కలే ఇప్పుడు సరికొత్త ఫ్యాషన్. కొంచెం క్రేజీగా ఇంకొంచెం అందంగా ఉన్న స్ప్లాటర్ ఫ్యాషన్‌ని మనమూ ఆహ్వానించేద్దామా..?**

ఈ ప్రకృతిలో ఉన్న డిజైన్లన్నీ అయిపోతే అప్పుడేం చేస్తాం... కొత్త ఫ్యాషన్‌ని సృష్టించడం ఎలా... ఇలాంటి ఆలోచనలు డిజైనర్లకు అస్సలు రావనుకుంటా. పెయింట్ చింది పడితే కూడా ఇంత అందమైన డిజైన్లు పుట్టుకొస్తాయని కనిపెట్టగలిగారంటేనే ఆ విషయం అర్థం కాకమానదు. 'ఆ ఒక్కటీ అడక్కు' సినిమాలో రాజేంద్రప్రసాద్ షర్టు చెయ్యి చిరిగిపోయినా, పాన్ మరకలు పడినా అన్నిటినీ ఫ్యాషన్‌గా మార్చేస్తాడు. ఆ డిజైన్లు బాగా పాపులర్ అయిపోతాయి. అది సినిమా కాబట్టి అలా జరిగిందనుకోవడానికి లేదు. ఎందుకంటే ఎంత కొత్తగా విభిన్నంగా ఆలోచిస్తే ఫ్యాషన్ పంట అంత బాగా పండుతుందన్నది నేటి డిజైనర్ రైతుల ఉవాచ. యువత ఫ్యాషన్ ఆకలి తీర్చడమంటే మామూలు విషయం కాదు మరి. అందుకే, పువ్వులూ పండ్లూ గీతలూ చారలూ పోల్కాడాట్‌లూ యానిమల్ ప్రింట్లూ... ఎప్పుడూ ఇవేనా అంటూ మొహం చిట్లిస్తున్న టీనేజీకోసం 'వావ్... ఇలాంటి డిజైన్లు కూడా ఉంటాయా...' అనిపించేలా స్ప్లాటర్ ప్రింట్లకు ఫ్యాషన్ కిరీటం తొడిగేశారు. అదికాస్తా అమ్మాయిలూ అబ్బాయిలకు హాట్ ఫేవరెట్ అయిపోయింది. దాంతో పెయింట్‌ను విసిరినట్లూ చల్లినట్లూ ఉన్న ఈ రంగు రంగుల డిజైన్లు స్కర్టులూ షర్టులూ గౌన్లూ జీన్సులూ లెగ్గింగ్‌ల దగ్గర్నుంచి చెప్పులూ సాక్సులూ హ్యాండ్ బ్యాగులూ టోపీల వరకూ అన్నింటిపైనా అతుక్కుపోతున్నాయి.

## పిల్లలకూ

ఒకప్పుడు ఫ్యాషన్ అంటే కేవలం పెద్దవాళ్లకు మాత్రమే పరిమితమైన విషయం. కానీ ఇప్పుడలా కాదు. అందుకే, చిన్నారుల బట్టల్లోనూ స్ప్లాటర్ ప్రింట్ల ఫ్యాషన్ హంగామా చేసేస్తోంది. నిజానికి ఈ స్ప్లాటర్ ఫ్యాషన్ ఎనభైలలోనే మొదలైంది. అప్పట్లో ఓ ఊపు ఊపి కనుమరుగైంది. మళ్లీ ఇన్నాళ్లకు ర్యాంపుల మీదికీ తర్వాత అమ్మాయిలూ అబ్బాయిల వార్డ్‌రోబ్‌లలోకీ చేరుతోంది. ఇందులో అంత ప్రత్యేకత ఏముందీ... రంగులు చల్లితే అన్ని డిజైన్లూ ఒకలానే ఉంటాయనుకోనక్కర్లేదు. ఎందుకంటే అబ్‌స్ట్రాక్ట్ పెయింటింగుల తరహాలో ఈ రంగుల్ని విభిన్నమైన డిజైన్లలో చల్లుతారు. అలా వేరు వేరు రంగుల్ని జల్లుతూ ఆకర్షణీయమైన జంతువులూ పక్షుల బొమ్మల్ని కూడా చిత్రిస్తారు. మామూలుగా కూడా రంగు చల్లే విధానాన్ని బట్టి డిజైన్లలో చాలా మార్పులొస్తుంటాయి. ఓ పక్క చిటపట చినుకులూ... మరోపక్క రంగుల జల్లులు... ఫ్యాషన్ ప్రకృతితో జతకడితే అధరహో అనకుండా ఉండగలమా..?




# 26 ఏళ్లు... కంపెనీలు!

**26 ఏళ్లకు ఉద్యోగం కోసం వెతుక్కునే కుర్రాళ్లు దేశంలో కుప్పలు తెప్పలుగా కనిపిస్తారు. కానీ అదే వయసులో 26 స్టార్టప్‌లలో పెట్టుబడి పెట్టి వాటిని లాభాల బాటలో నడిపిస్తున్నాడు డా.రితేష్ మాలిక్. సొంతంగా మరి కొన్ని సంస్థలనూ నిర్వహిస్తున్నాడు. మోదీ సూచనపై 'స్టార్టప్ ఇండియా-స్టాండప్ ఇండియా' పథకంలోనూ భాగమయ్యాడు. భారత్‌ను స్టార్టప్‌ల రాజధానిగా మార్చే లక్ష్యంతో వైద్య వృత్తినీ పక్కన పెట్టిన రితేష్ 'మల్టీ టాస్కింగ్' అనే పదానికి అచ్చమైన ఉదాహరణ.**



డబ్బులొచ్చే పనికంటే మనసుకు నచ్చిన పని చేస్తేనే ఎక్కువ సంతోషం. అదే విషయాన్ని నమ్మి చిన్నప్పట్నుంచీ కష్టపడి ప్రవేశించిన వైద్య రంగాన్ని వదులుకొని ఇష్టపడ్డ స్టార్టప్‌ల ప్రపంచంలోకి అడుగుపెట్టాడు రితేష్. ఈ దిల్లీ కుర్రాడు తొమ్మిదేళ్ల క్రితం చెన్నైలో ఎంబీబీఎస్ కోర్సులో చేరాడు. అప్పుడప్పుడే ఫేస్‌బుక్ విస్తరిస్తోంది. దాన్ని స్థాపించిన జుకెర్‌బర్గ్ చిన్న వయసులోనే ప్రపంచవ్యాప్తంగా మంచి పేరు తెచ్చుకున్నాడు. ఓ వైద్యుడిగా తనకంత త్వరగా పేరు రావడం అసాధ్యమనీ, స్టార్టప్‌ల రంగంలోకి వెళ్తేనే అలాంటి గుర్తింపు దక్కుతుందనీ అనుకున్నాడు. ఎంబీబీఎస్ నాలుగో ఏడాదిలో ఉండగా మూడు నెలలు కాలేజీకి డుమ్మా కొట్టి 'లండన్ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్'లో 'మార్కెటింగ్ సైన్స్ 101' అనే కోర్సు చేశాడు. సిలికాన్ వ్యాలీని సందర్శించి అక్కడ స్టార్టప్‌లకు లభిస్తోన్న ఆదరణ గురించి తెలుసుకున్నాడు. వైద్యుడిగా కంటే వ్యాపారిగానే ఎక్కువ జీవితాల్ని ప్రభావితం చేయొచ్చని అర్థమై, అతడి స్టార్టప్‌ల ప్రేమ మరింత పెరిగింది.

### తొలి ఆప్ సూపర్‌హిట్!

ఎంబీబీఎస్ చివరి ఏడాదిలో ఉండగానే స్నేహితుడితో కలిసి 'యాడ్‌స్టక్' పేరుతో మొబైల్ ఆప్స్‌ను తయారు చేసే స్టార్టప్‌ను రితేష్ మొదలుపెట్టాడు. అందులో భాగంగా స్నేహితుడు తయారు చేసిన 'ఎలైవ్' అనే ఆప్ మార్కెటింగ్, అమ్మకాలూ, పీఆర్ బాధ్యతలు చూసుకున్నాడు. ఆగ్మెంటెడ్ రియాలిటీ పరిజ్ఞానంతో తయారైన ఆ ఆప్ ద్వారా పత్రికల్లో అక్షరాలూ, ప్రకటనలనూ స్కాన్ చేసి నేరుగా ఆ సమాచారానికి సంబంధించిన మరిన్ని వివరాలను ఇంటర్నెట్‌లో చూసుకోవచ్చు. అది మార్కెట్లోకి వచ్చిన కొన్నాళ్లకే పెట్టుబడి కంటే ఎన్నో రెట్లు ఎక్కువగా చెల్లించి 'టైమ్స్ గ్రూప్' కొనుగోలు చేసింది. ఆ లావాదేవీ ద్వారా రితేష్‌కు తన కలల్ని నిజం చేసుకోవడానికి కావల్సినంత డబ్బు సమకూరింది. దాంతో జూనియర్ డాక్టర్‌గా ఉండగా ఆ వృత్తికి స్వస్తి పలికి హార్వర్డ్ విశ్వవిద్యాలయానికి వెళ్లి 'మేనేజ్‌మెంట్ ఆఫ్ టెక్నాలజీ అండ్ ఇన్నొవేషన్' కోర్సులో చేరాడు. ఆపైన స్టార్టప్‌లపైన అవగాహనతో పాటు ఆత్మవిశ్వాసంతో మళ్లీ భారత్‌లో అడుగుపెట్టాడు.

### అలాంటివాళ్లకే చోటు

తక్కువ సమయంలో ఎక్కువ లాభాలొచ్చే సాఫ్ట్‌వేర్ రంగ సంస్థల కంటే తనకు ఆసక్తి ఉన్న హార్డ్‌వేర్ రంగంలోనే పెట్టుబడులు పెట్టాలన్న లక్ష్యంతో అన్వేషణ మొదలుపెట్టిన రితేష్‌కి కేరళలోని 'ఫిన్ రొబోటిక్స్' అనే స్టార్టప్ బాగా నచ్చింది. వైద్య రంగంలోని అనేక సేవలకు ఉపయోగపడే రోబోలను సృష్టిస్తోన్న సంస్థ అది. 'గెరిల్లా వెంచర్స్' పేరుతో కంపెనీ మొదలుపెట్టి 'ఫిన్ రొబోటిక్స్'లో రూ.కోటి పెట్టుబడి పెట్టడంతో పాటు వైద్యుడిగా తన సూచనలనూ వాళ్లతో పంచుకున్నాడు. రోబోల అభివృద్ధిలో వేగంగా పురోగతి సాధించడంతో సంస్థ విలువ రూ.100కోట్లు దాటింది. దాంతో రితేష్ వాటా విలువకూడా పెరిగింది. ఆ ఉత్సాహంతో నెమ్మదిగా 'ఊ స్టేస్', 'కామెట్ కోర్', 'ఫ్లిప్ టెక్నాలజీస్', 'అసిమోవ్ రొబోటిక్స్', 'ఉడ్ ఆపిల్' లాంటి 26 స్టార్టప్‌లలో సగటున పాతిక లక్షల రూపాయలు పెట్టుబడిగా పెట్టాడు. 'ఎవరైనా వెయ్యి కోట్ల రూపాయలు విలువైన కంపెనీని సృష్టించడమే లక్ష్యమని చెబితే, వాళ్ల జోలికి నేను వెళ్లను. కనీసం వెయ్యి మంది జీవితాలనైనా ప్రభావితం చేయగలవాళ్లకే నా ఓటు' అంటాడు రితేష్.

### ప్రధాని అభినందన

పెట్టుబడి పెట్టిన స్టార్టప్‌లతో పాటు సొంతంగా 'యాడ్‌స్టక్', 'హార్విన్ అకాడమీ', 'థింక్ పాట్' లాంటి సంస్థలనూ రితేష్ నిర్వహిస్తున్నాడు. అన్నింట్లోకి అతడి మనసుకి బాగా నచ్చిన సంస్థ ఇన్నొవేట్(innov8). ఆఫీసు అద్దెలూ, ఫర్నీచర్, ఇతర సదుపాయాలకు ఎక్కువ డబ్బులు చెల్లించలేని స్టార్టప్ వ్యవస్థాపకులంతా ఒకే గొడుగు కిందకి వచ్చి పనిచేసుకునే కేంద్రం అది. అక్కడ 136 స్టార్టప్‌లకు చోటు కల్పించాడు. అమ్మాయిలను ప్రోత్సహించడం కోసం తన ప్రాంగణంలో వాళ్లకు మంచి రాయితీలివ్వడంతో పాటు ఇన్వెస్టర్లతో ప్రత్యేక సెమినార్లను ఏర్పాటు చేస్తున్నాడు. రితేష్ చేస్తోన్న పనులు కేంద్ర ప్రభుత్వం దృష్టినీ ఆకర్షించాయి. అందుకే 'స్టార్టప్ ఇండియా-స్టాండప్ ఇండియా' పథకంలో భాగమై, కాలేజీల స్థాయిలోనే విద్యార్థులకు స్టార్టప్‌లపైన అవగాహన పెంచడంలో సహాయపడమని ఆహ్వానించింది. అందులో భాగంగా రాష్ట్రపతిని ఉత్తరాఖండ్‌లోని జీబీ పంత్ వ్యవసాయ విశ్వవిద్యాలయానికి తీసుకెళ్లి పదివేల మంది విద్యార్థులకు సెమినార్ నిర్వహించాడు. ఆ చొరవకు ప్రధాని అభినందనలూ అందుకున్నాడు. ఈ ఏడాది ఫోర్బ్స్ 'ఫైనాన్స్ అండ్ వెంచర్ క్యాపిటల్' విభాగంలో ప్రపంచంలోని అత్యుత్తమ 30 మందిలో ఒకడిగా ఎంపికయ్యాడు. 'నా జీవన శైలి సాదాసీదాగా ఉంటుంది. అందుకే నా పెట్టుబడుల ద్వారా ఎంత డబ్బు వచ్చినా, తిరిగి మరో స్టార్టప్‌కు ప్రాణం పోయడం కోసమే ఖర్చు చేస్తా. సంపాదించిన డబ్బంతా పోయినా, డాక్టర్ పట్టాతో బతికేస్తా. అందుకే ఈ రంగంలో ఎంత రిస్కు చేయడానికైనా సిద్ధం' అంటాడు రితేష్. మరిన్ని వివరాలు... drriteshmalik.comలో.





‘నాలుగు వందలకు పైగా సినిమాలూ, నాలుగు నంది అవార్డులూ, కడుపు నింపడానికి ఎప్పటికప్పుడు తలుపు తడుతోన్న కొత్త అవకాశాలూ... మరి మనసు నింపడానికి?’... ఈ ఆలోచనే ఎల్‌బీ శ్రీరాంని ఇంటర్నెట్ ప్రపంచంలోకి తీసుకొచ్చింది. పక్కింటి బాబాయిలా, పేదింటి తండ్రిలా, ఎదురింటి రైతులా, మనింట్లో మనిషిలా మార్చి జీవితం ఎంత అందమైందో చెప్పే ప్రయత్నం చేస్తోంది. ఎల్‌బీ శ్రీరాం షార్ట్ ఫిలిమ్స్... అతడి సెకండ్ ఇన్నింగ్స్ కాదు, రెండో జీవితం..!

# నష్టాలొస్తాయని తెలిసే చేస్తున్నా!

ఎల్‌బీ శ్రీరాం హార్ట్ ఫిలిమ్స్... నా లఘు చిత్రాలకు నేను పెట్టుకున్న పేరది. చూసిన ప్రతి ఒక్కరి మనసులనూ సంతోష పెట్టాలన్నది నా ఉద్దేశం. ‘ఎల్‌బీ క్రియేషన్స్’ అంటే ‘లైఫ్ ఈజ్ బ్యూటిఫుల్ క్రియేషన్స్’ అన్నది నా నిర్వచనం. దానిద్వారా మన చుట్టూ ఉన్న మంచిని చూపించాలన్నదే నా ఆలోచన. ఈ పేర్లను చూస్తేనే నేను చిన్నిచిత్రాలు ఎందుకు తీస్తున్నానో, ఎలాంటివి తీయాలనుకుంటున్నానో అర్థమైపోతుంది. నటుడిగా బిజీగా ఉన్నప్పట్నుంచీ లఘు చిత్రాల్లో నటించాలన్న కోరిక ఉండేది. దానికి కారణం నాటకాలు. నా కెరీర్‌కి రంగ స్థలమే పునాది వేసింది. ఆ తరవాత రేడియోలోనూ నా నాటకాలు వచ్చాయి. ఆపైన రచయితగా మారి ఎన్నో సూపర్‌హిట్ చిత్రాలకు పనిచేశా. చివరికి నటుడిగా మలుపు తీసుకొని క్షణం తీరికలేని స్థితికి చేరుకున్నా. ఎన్ని సినిమాల్లో నటిస్తున్నా ఏదో తెలీని అసంతృప్తి ఉండేది. సినిమాల్లో ఏ సన్నివేశం ఎప్పుడు తీస్తారో తెలీదు. ముందు ఓ కామెడీ సీన్ చేసి, వెంటనే ప్రేక్షకుల్ని కన్నీరు పెట్టించాల్సిన సన్నివేశంలో నటించాల్సి రావొచ్చు. అలా ముక్కలుముక్కలుగా నటించడం వల్ల కథలోని భావోద్వేగానికి దూరమవుతున్నా అనిపించేది. కానీ నాటకాల్లో అలా కాదు. అన్నీ వరస క్రమంలో ఉంటాయి. ప్రతి సన్నివేశం ఒక దాని వెంట ఒకటి వస్తుంది కాబట్టి ఎక్కడ ఎంత వరకూ నటించాలో తెలుస్తుంది. ఎక్కడా బ్రేకుల్లేకుండా ఓ కథను అలా చూడటం ప్రేక్షకులకూ హాయిగా ఉంటుంది. నటులకూ సంతృప్తిగా అనిపిస్తుంది. సినిమాలతో బిజీగా ఉన్నా, ఆ ఆనందం కోసమే అవకాశం వస్తే నాటకాలు వేయాలన్న ఆలోచన వచ్చింది.

## చాలా ఏళ్ల నుంచే...

మళ్లీ స్టేజీ ఎక్కాలన్న కోరిక నాకు మొదలయ్యే నాటికి నాటకాలకి ఆదరణ కాస్త తగ్గింది. చూసే వాళ్లకోసమే వేయాలన్న ఆలోచన నాకున్నా, సినిమాల వల్ల వాటికి సమయం కేటాయించలేనేమో అనిపించింది. అప్పుడే నాటకాలకు ప్రత్యామ్నాయంగా లఘు చిత్రాల్లో నటించాలనిపించింది. సినిమాల్లో చేస్తూ లఘుచిత్రాలంటే స్థాయి తగ్గిపోతుందనీ, సినిమా అవకాశాలు దెబ్బతింటాయనీ చాలామంది అనుకుంటారు. కానీ నేనలా భయపడకుండా చాలా ఏళ్ల క్రితం ‘రాళ్లు’ అనే ఓ లఘు చిత్రంలో నటించా. భార్యకు వైద్యం చేయించడానికి తపనపడే ఓ పేద శిల్పి కథ అది. ఎదుటి వాళ్ల మాటలే రాళ్ల కంటే పదునైనవనీ, పక్కవాళ్ల బాధల్ని అర్థం చేసుకోలేని మనుషులే నిజమైన రాళ్లనీ చెప్పే మంచి ఇతివృత్తంతో అది సాగుతుంది. హైదరాబాద్‌లో జరిగిన ఓ అంతర్జాతీయ చిత్రోత్సవంలో దానికి ఉత్తమ లఘుచిత్రంగా బహుమతి వచ్చింది. నటుడిగా నాకు ఎక్కడలేని సంతృప్తినిచ్చింది. దానివల్ల నా సినిమా అవకాశాలకు ఏమాత్రం ఇబ్బంది రాలేదు. చాలామంది డబ్బుల కోసం కాకుండా ఓ మంచి విషయాన్ని జనాలకు చెప్పే ఉద్దేశంతో షార్ట్ ఫిలిమ్స్ తీస్తుంటారు. దాంతో అప్పట్నుంచీ అవకాశమొస్తే అలాంటి వాటిల్లోనే రూపాయి తీసుకోకుండా నటించాలని నిర్ణయించుకున్నా.

## నాలుగో అడుగు నెట్టింట్లో

సినిమా షూటింగుల్లో ఉన్నప్పుడే విరామంలో లఘు చిత్ర దర్శకులతో మాట్లాడి కథల గురించి చర్చించేవాణ్ణి. ఓసారి అలా ఫణి అనే కుర్రాడు తీసిన ‘పల్లకి’ అనే లఘు చిత్రంలో బోయవాడి పాత్రలో నటించాను. ఓ మంచి కథను చూపించాలన్న ఆశతో ఆ కుర్రాడు అమెరికా నుంచి వచ్చి దాన్ని తీశాడు. అతడి తపనకు న్యాయం చేయడానికి ప్రయత్నించా. ఎంత మంచి ఆదరణ వచ్చిందంటే, ఈటీవీలో దాన్ని ప్రత్యేక చలనచిత్రం పేరుతో ప్రదర్శించారు. ఆపైన ‘ఆర్ట్ ఈజ్ డెడ్’, ‘బిస్లేరీ బాటిల్’, ‘అలీస్ లెటర్’ లాంటి కొన్ని లఘుచిత్రాల్లో నటిస్తూ వచ్చా. సినిమా పనులకు కాస్త విరామం వచ్చినప్పుడల్లా చిన్ని చిత్రాల షూటింగుల్లో పాల్గొనేవాణ్ణి. రోజులు అలా గడుస్తున్నా నా ఆకలి తీరట్లేదు. అప్పుడప్పుడూ ఒక్కొక్కటీ చేయడం కరెక్టు కాదనిపించింది. నటుడిగా మారాక రచనకు కాస్త దూరమయ్యా. దాంతో నేను చెప్పాలనుకున్న చాలా విషయాలు బాకీ పడ్డాయి. వాటన్నింటినీ చెప్పాలంటే సరైన వేదిక కావాలి. సినిమాలు తీద్దామంటే కోట్లలో ఖర్చు. పోనీ కష్టపడి ఏదైనా ఒక సినిమా తీస్తే, అది హిట్టయినా మరో పది సినిమాలు తీసేంత శక్తీ, సమయం లేవనిపించింది. అదే ఫ్లాపయితే ఆర్థిక భారం తట్టుకునే పరిస్థితీ లేదు. టీవీలో డైలీ సీరియళ్లు నాకంతంగా రుచించవు. దాంతో నాకు కనిపించిన చివరి మార్గం ఇంటర్నెట్. యూట్యూబ్‌లో ఓ ఛానెల్ మొదలుపెట్టి క్రమం తప్పకుండా అసంఖ్యాకంగా లఘు చిత్రాలు తీయాలనీ, అక్కడా నాకంటూ ఓ ముద్ర వేయాలనీ నిర్ణయించుకున్నా. అలా నాటకాలూ, రేడియో, సినిమాలను దాటి నాలుగో అడుగు అంతర్జాలంవైపు వేశా.

## నష్టాలకు సిద్ధపడే...

యూట్యూబ్‌లో లఘుచిత్రాలు తీసే కుర్రాళ్లలో ఎక్కువ శాతం మంది వాటిని సినిమా పరిశ్రమలోకి రావడానికి నిచ్చెనలా వాడుకునే ఉద్దేశంతో కనిపిస్తారు. నాకు ఆ అవసరం లేదు. లఘుచిత్రాన్ని కోటి రూపాయలు ఖర్చుపెట్టి తీసినా వంద రూపాయలు కూడా లాభం రాకపోవచ్చు. కాబట్టి ఇక్కడ డబ్బు సంపాదించాలన్న ఉద్దేశమూ లేదు. అరవయ్యేళ్లు పైబడ్డ అనుభవంతో నేను నేర్చుకున్న, నాకు తెలిసిన కొన్ని మంచి విషయాలను నలుగురితో పంచుకోవాలన్న తపనతోనే ఈ దారిలోకొచ్చా. అందరి మనసులకూ నా చిత్రాలు దగ్గరవ్వాలన్న ఉద్దేశంతో ‘హార్ట్

ఫిల్మ్స్' అనీ, జీవితం చాలా అందమైనదని చూపించే ఉద్దేశంతో 'ఎల్‌బీ అంటే లైఫ్ ఈజ్ బ్యూటిఫుల్ క్రియేషన్స్' అనీ పేర్లు పెట్టా. దీని కోసం కొన్ని కచ్చితమైన నిబంధనలూ రాసుకున్నా. అందులో మొదటిది నిడివి. యూట్యూబ్‌ని చూసేవాళ్లలో యువతే ఎక్కువ. ఒక చిత్రంపైన 20, 30 నిమిషాలు కేటాయించేంత ఓపిక వాళ్లకుండదు. అందుకే పది నిమిషాలకు మించి ఏ చిత్రమూ ఉండకూడదని నిర్ణయించుకున్నా. దానివల్ల ఒక్కోసారి మంచి కథలనూ అంత తక్కువ సమయంలో చెప్పలేక దూరం చేసుకోవాల్సి వస్తోంది. రెండోది బడ్జెట్... నష్టాలకు సిద్ధపడే లఘుచిత్రాల నిర్మాణానికి పూనుకున్నా. ఉదాహరణకు పది లక్షలు నష్టపోయినా ఫర్వాలేదనుకుంటే, అందులో ఐదేసి లక్షలు పెట్టి రెండు సినిమాలు తీసే బదులు, యాభై వేల చొప్పున పెట్టి ఓ ఇరవై సినిమాలు తీయడం మంచిది. అదే సిద్ధాంతంతో తక్కువ బడ్జెట్ కేటాయిస్తూ వస్తున్నా. మూడోది నటీనటులు... డబ్బులు మిగుల్తాయి కదాని ఎవరు పడితే వాళ్లని తీసుకోను. నటనపైన తపన ఉండీ, ఎంతో కొంత అనుభవం ఉన్నవాళ్లకే ప్రాధాన్యమిస్తున్నా. నిర్మాణం, దర్శకత్వం, నటన, ఎడిటింగ్, నటీనటుల ఎంపిక లాంటి పనులన్నీ చూసుకుంటూ మళ్లీ నేను కథలు రాయాలంటే సమయం సరిపోదు. అందుకే వీలైనంత వరకూ వేరే వాళ్ల కథలే తీసుకొని నా కథనంతో నడిపించాలని నిర్ణయించుకున్నా. ఇలా కొన్ని కచ్చితమైన నిబంధనలతోనే చిన్ని చిత్రాలకు శ్రీకారం చుట్టా.

### కుర్రాళ్లతో కలిసి

నాటకాలకు దర్శకత్వం వహించిన అనుభవంతో షార్ట్ ఫిల్మ్స్ తీయొచ్చని అనుకున్నా. కానీ దిగాకే తెలిసింది అదెంత కష్టమైన పనో. అనుకున్న విషయం చెప్పడానికి సరైన లొకేషన్లూ, నటీనటుల అన్వేషణ కోసం చాలా శ్రమ పడాలి. నిడివి ఎంతున్నా 24 సినిమా విభాగాలూ పనిచేయాలి. నా నుంచి మంచి మాటలూ, హాస్యం, కొత్తదనమున్న కథాంశాలనే జనాలు ఆశిస్తారు తప్ప గ్రాఫిక్‌లూ, ఇతర విషయాలపైన పెద్దగా దృష్టి పెట్టరన్నది నా నమ్మకం. అందుకే కథావస్తువుకే విలువిస్తూ ఐదు నెలల క్రితం నా పుట్టిన రోజు సందర్భంగా ఈ కొత్త ప్రయాణం మొదలుపెట్టా. తొలి విడతగా పదకొండు చిత్రాలు తీసి అందులో రెండు వారాలకు ఒకటి చొప్పున ఏడు చిత్రాలను విడుదల చేశా. వాటికొచ్చే కామెంట్ల ఆధారంగా నన్ను నేను మెరుగు పరచుకునే ప్రయత్నం చేస్తున్నా. యూట్యూబ్‌లో ముఖాముఖి ద్వారా ప్రేక్షకుల ప్రశ్నలకూ సమాధానమిస్తున్నా. రెండో విడతలో తీయబోయే చిత్రాలకూ సన్నాహాలు పూర్తయ్యాయి. ఈ దఫా ఒకేసారి పది-పదిహేను చిత్రాలు తీసి ప్రతి రెండో శుక్రవారం ఒక్కోటి విడుదల చేయాలన్నది నా ఆలోచన. నాది ఒంటెద్దు బండి ప్రయాణం. ఇప్పటి తరం కార్లలో దూసుకెళ్తోంది. ఆ వేగాన్ని అందుకోవడానికి వాళ్లతో కలిసి ప్రయాణిస్తేనే బావుంటుందని, నా బృందంలో అందరినీ కుర్రాళ్లనే పెట్టుకున్నా. వాళ్లతో పనిచేయడం వల్ల ఈ తరానికి తగ్గట్లుగా నా ఆలోచనలూ మారుతున్నాయి. ఇంటర్నెట్‌తో పాటు టీవీ కోసమూ కొన్ని ప్రాజెక్టులు సిద్ధం చేసుకున్నా.

### ఎప్పటికీ గుర్తుండేలా

అమలాపురం దగ్గర ఐదిళ్లు ఉండే ఓ చిన్న అగ్రహారంలో పుట్టి పెరిగిన నేను మొదట నాటకాల్లో రాష్ట్రవ్యాప్తంగా పేరు సంపాదించుకున్నా. తరవాత ఆలిండియా రేడియోలోనూ నా ముద్ర వేశా. ఆ పైన పరిశ్రమలోకి వచ్చి ఎన్నో హిట్ సినిమాలకు రచయితగా, నాలుగు వందలకుపైగా సినిమాల్లో నటుడిగా గుర్తింపు తెచ్చుకున్నా. ఆ సుదీర్ఘ అనుభవంతో కొత్తతరానికి నాకు తెలిసిందేదో చెప్పాలన్నదే నా తాపత్రయం. యూట్యూబ్‌లో చిత్రాలకు హిట్లూ, ఫ్లాపులూ అన్న భేదం ఉండదు. ఒకరోజు వంద మంది చూస్తే, మరో రోజు వెయ్యిమంది చూడొచ్చు. వాటికి కాలదోషమూ పట్టదు కాబట్టి ఎప్పటికీ నా సినిమాలు అందులో సంచరిస్తూనే ఉంటాయి. అమరావతి కథలు, మాల్గుడి డేస్‌లాగా వాటికీ ఆదరణ తీసుకురావాలన్నది నా ప్రయత్నం. అలా రావాలంటే ఎక్కువ చిత్రాలు తీస్తే సరిపోదు, వాటిద్వారా ఎంతో కొంత మంచినీ చెప్పగలగాలి. అలా నా లఘుచిత్రాల ప్రభావం ఓ పదిమంది ఆలోచనలను మార్చినా, నా సెకండ్ ఇన్నింగ్స్... 'సెకండ్ విన్నింగ్స్' అయినట్టే లెక్క.



## ఎల్బీ ఏడడుగులు!

**మా నాన్న:** ఊరి నుంచి నాన్న ఇంటికొచ్చాడంటే, అది డబ్బులడగడానికే కాదు, ఇవ్వడానికీ కావొచ్చు. తల్లిదండ్రుల్ని అపార్థం చేసుకునే ముందు ఆలోచించండీ... అని చెప్పే ఇతివృత్తంతో సాగుతుంది.







**నర్స్:** రోగి శరీరానికే కాదు, సందర్భాన్ని బట్టి నర్సులు మనసుకూ ఎలా వైద్యం చేస్తారో చూపించే చిత్రం.

**పండగ:** పాడీ పంటా లేకపోయినా, ఆవు పేడతో కూడా పండగ ఎంత ఘనంగా చేసుకోవచ్చో చూపే సరదా ప్రయత్నం.



**ప్రసాదం:** సాధారణంగా గుడిలో ప్రసాదం అంటే తినే పదార్థాలే పెడతారు. దాని బదులు ఓ మంచి పుస్తకాన్ని భక్తులకు ప్రసాదంగా అందిస్తే ఎంత లాభమో ఈ 'ప్రసాదం' చెబుతుంది.




**గంగిరెద్దు:** సంక్రాంతి సమయంలో గంగిరెద్దు తన యజమానిని ఆదుకోలేకపోయినా, ఓ ఊహించని పోటీ ద్వారా అతడిని అప్పుల నుంచి ఎలా బయట పడేసిందన్నదే గంగిరెద్దు కథ.



**దేవుడు:** గుళ్లోనో, రాళ్లలోనో కాదు, మనసు పెట్టి చూడాలే కాని దేవుడు అన్ని చోట్లా కనిపిస్తాడని చెప్పడమే 'దేవుడు' ఉద్దేశం.



**ఉమ్మడి కుటుంబం:** పెరిగిపోతోన్న అపార్టుమెంట్ల సంప్రదాయం ద్వారా పక్కింట్లో ఎవరుంటారో కూడా తెలీని పరిస్థితి చాలామందిది. అందరితో కలిసుండటానికి అలవాటు పడ్డ వ్యక్తి, తన అపార్టుమెంట్లో వాళ్లందరినీ తెలివిగా ఎలా దగ్గర చేశాడో చెబుతుందీ 'ఉమ్మడి కుటుంబం'.



కొత్త ప్రతిభను ప్రోత్సహించడానికి ఎప్పుడూ సిద్ధమేనంటారు ఎల్బీ శ్రీరాం. లఘుచిత్రాలపైన ఆసక్తి ఉన్నవాళ్లూ, సంప్రదించాలనుకునేవాళ్లూ lbsriramshortfilms@gmail.comకి వివరాలు మెయిల్ చేయవచ్చు.




ఆన్‌లైన్లో కంపెనీ పెట్టడం ఒక సవాలైతే, కంపెనీకి సరైన పేరు పెట్టడం మరో సవాలు. ఆ పేరు సేవల విస్తరణకు అడ్డంకి కాకూడదు, వెబ్‌సైట్ అందుబాటులో ఉండాలి. అందుకే పేర్ల వెనక చాలా కసరత్తే చేస్తుంటారు. ఇండియాలో తమకంటూ ప్రత్యేక స్థానాన్ని సంపాదించిన కొన్ని ఆన్‌లైన్ సంస్థల పేర్లు ఎలా పెట్టారో చూడండి!

# మంత్రా నుంచి మింత్రా!




### జబాంగ్... ఓ మొక్క

జబాంగ్‌డాట్‌కామ్... ప్రఖ్యాత ఆన్‌లైన్ దుస్తుల దుకాణం. పేరు నమోదు చేసిన సమయంలో కంపెనీలో పనిచేస్తున్న పది మందీ మూడ్రోజులపాటు దాని గురించే ఆలోచించారట. భవిష్యత్తులో తాము అమ్మే ఉత్పత్తులు మారొచ్చన్న ఉద్దేశంతో పేరు ఏదో ఒక వస్తువును తెలిపేలా ఉండకూడదనుకున్నారట. 'ఫ్యాషన్‌స్ట్రీట్', 'డిజైన్‌హౌస్', 'ఫ్యాషన్‌బే' లాంటి పేర్లు అనుకున్నా, చివరకు 'జబాంగ్' అని నిర్ణయించారు. ఇది ఏడాది పొడుగునా పచ్చగా ఉండే ఓ నిమ్మజాతి మొక్క పేరు. కంపెనీ పనితీరూ, ఉత్పత్తులూ నిత్యనూతనంగా ఉంటాయని చెప్పేందుకు దాన్ని ఎంపిక చేశారు.

### స్పెయిన్ పలకరింపు... ఓలా

ఓ భారతీయ కంపెనీ హిందీ, ఇంగ్లిష్, సంస్కృత భాషల్ని దాటి స్పెయిన్ భాషలోని పదాన్ని పెట్టుకోవడం సాహసమే. ఆ పనే చేశారు ఓలా వ్యవస్థాపకుడు భవీష్ అగర్వాల్. స్పానిష్‌లో 'ఓలా' అంటే 'హలో' అని అర్థం. తన కంపెనీ పేరుకి చాలా పదాల్ని పరిశీలించాక 'ఓలా'నే చివరకు ఎంపిక చేశారు. పేరులోనే ఒకలాంటి ఆత్మీయత ఉండటమే దానికి కారణమంటారు అగర్వాల్.

### అర్థం వద్దనుకున్న 'ఫ్లిప్‌కార్ట్'

విజయవంతమైన ఇ-రిటైలర్‌గా చెప్పే సంస్థ 'ఫ్లిప్‌కార్ట్‌డాట్‌కామ్'. ఫ్లిప్‌కార్ట్ అంటే స్పష్టంగా ఒక అర్థమేమీ లేదు. తమ కంపెనీకి అలానే పేరు పెట్టుకోవాలనుకున్నారు వ్యవస్థాపకులు సచిన్ బన్సాల్, బిన్నీ బన్సాల్. పేరు ఒకే పదంలా ఉండాలి, ఆ పేరుకి వెంటనే స్ఫురించే అర్థమంటూ ఉండకూడదు, షాపింగ్‌కు సంబంధించినదని తెలియాలి... సంస్థ సేవలు పుస్తకాలతో ప్రారంభమయ్యాయి... కానీ 'బుక్' అనే పదం ఉండకూడదు... ఎందుకంటే భవిష్యత్తులో తాము అమ్మే వస్తువుల్లో వేరేవీ ఉండొచ్చు... ఇన్నింటి మధ్య పుట్టిందే ఫ్లిప్‌కార్ట్.

### వేగానికి గుర్తుగా స్నాప్‌డీల్

దేశంలో బిలియన్ డాలర్ల ఆన్‌లైన్ కంపెనీల్లో ఒకటిగా స్నాప్‌డీల్‌కు గుర్తింపు ఉంది. 'సంస్థ పేరు చిన్నదిగా ఉండాలి, సేవల్లో వేగాన్ని తెలిపేదిగా కనిపించాలి, అలాగే, ఎలాంటి స్పెల్లింగ్ మిస్టేక్‌లూ ఉండకూడద'ని అనుకున్నారట వ్యవస్థాపకులు రోహిత్, కునాల్... ఈ పరిమితులతో చాలా పేర్లను పరిశీలించినా, చివరకు స్నాప్‌డీల్‌ను ఎంచుకున్నారు. సింపుల్‌గా ఉంటూనే, రొటీన్‌కు భిన్నమైన పేరులా ఉందని దీన్ని ఎంచుకున్నామని చెబుతారు రోహిత్.

### సగమే సంస్కృతం

ఆన్‌లైన్ ఫ్యాషన్ దుస్తుల దుకాణం 'మింత్రాడాట్‌కామ్' మొదలుపెట్టినపుడు పదికి పైగా పేర్లను పరిశీలించారట. చివరకు మిగిలిన వాటిలో కొందరు హిందీ పేరు పెడదామనీ ఇంకొందరు ఇంగ్లిష్‌లో ఉంటే బావుంటుందనీ అన్నారట. మధ్యే మార్గంగా 'మంత్ర' పదాన్ని ఎంచుకొని దాన్లో ఆధునికత ధ్వనించేలా కాస్త మార్చి 'మింత్ర'గా పెట్టారు.

### జివా అనుకొని... జివామి

జివా అంటే హీబ్రూలో వెలుగు అని అర్థం. ఆన్‌లైన్లో లోదుస్తులు అమ్మే తన సంస్థకు ఆ పేరే పెట్టాలనుకున్నారు రిచాకర్. కానీ 'జివాడాట్‌కామ్' అనే పేరుని అప్పటికే వేరొకరు రిజిస్టర్ చేసుకోవడంతో పేరు మార్చుకోవాల్సి వచ్చింది. కానీ రిచాకు ఆ పేరే బాగా నచ్చింది. దాంతో చివరకు 'జివామి' అని పెట్టారు.

### టొమాటో నుంచి జొమాటో

ఆన్‌లైన్లో వివిధ హోటళ్ల నుంచి ఆహార పదార్థాలను ఆర్డర్ ఇచ్చుకునే సంస్థ జొమాటో. మొదట ఈ సంస్థ పేరు foodiebay. కానీ 2010లో ఆ పేరుని మార్చాలనుకున్నారు. తమ పేరులో ebay లేకుండా ఆ కొత్త పేరు ఉండాలనుకున్నారు. ఆ సమయంలో టొమాటోలోని మొదటి అక్షరం మార్చి పద ప్రయోగం చేసి జొమాటోగా పెట్టారు. పదంలో ఒక నవ్యత రావడంతోపాటు చాలా సింపుల్‌గా ఉండటంతో ఆ పదాన్ని ఎంచుకున్నారు.

### పెప్పర్‌ఫ్రై... ఫర్నిచర్

పెప్పర్‌ఫ్రైడాట్‌కామ్... పేరుకీ సంస్థ అమ్మే ఉత్పత్తులకీ సంబంధమే లేదు. కావాలనే అలా పేరు పెట్టారు. ముంబయి కేంద్రంగా పనిచేసే ఈ కంపెనీ మొదట్లో దుస్తులూ, సౌందర్య సామగ్రి, గృహోపకరణాలు లాంటివి అమ్మేది. కానీ తర్వాత చాలా కంపెనీలు ఆ విభాగంలోకి రావడంతో పోటీ పెరిగింది. దాంతో వారికి అత్యధిక ఆదరణ లభిస్తోన్న ఫర్నిచర్‌కే సేవల్ని పరిమితం చేసింది. అయినా వారికి పేరుతో ఇబ్బంది రాలేదు. ఇప్పుడు ఆఫ్‌లైన్లోనూ కొన్ని దుకాణాలని తెరిచి గృహోపకరణాలను విక్రయిస్తోంది.

### బిగ్‌షూబజార్ అయ్యింది యేభీ

పాదరక్షలు అమ్మాలనే ఉద్దేశంతో మొదలైంది 'బిగ్‌షూబజార్‌డాట్‌కామ్'. కానీ ఆన్‌లైన్లో ఇంకా చాలా వస్తువులకు డిమాండ్ ఉందని గ్రహించి తమ సేవల్ని విస్తరించాలనుకున్నారు వ్యవస్థాపకులు. దాంతో పేరుని మార్చాల్సిన పరిస్థితి ఏర్పడింది. పది వరకూ పేర్లను తుది జాబితాలో పెట్టి వాటిలో ఏది బావుందో ఉద్యోగుల్నే చెప్పమన్నారట. ఆ పోటీలో 'యేభీడాట్‌కామ్'నే నెగ్గింది. 'ఇది కూడా' అని దీనర్థం. ఒకటని కాదు ఏదైనా మా దగ్గర దొరుకుతుందన్న అర్థం దీన్లో ఉంది. ఇప్పుడీ సంస్థ పాదరక్షలతోపాటు దుస్తులూ, బ్యాగులూ, ఫంకీ ఆభరణాలూ... ఇంకా చాలా అమ్ముతోంది.



# మటన్‌తో మస్త్... మస్త్..!

మటన్‌తో చాలా రకాలు చేస్తూనే ఉంటాం... అయితే చికెన్‌తో పోలిస్తే మటన్ కూరలు కాస్త ఎక్కువ సమయమే పడుతుంటాయి. అందుకే మరీ ఎక్కువ దినుసులూ అధిక ప్రయాస లేకుండా సింపుల్‌గా చేసుకోగలిగే కొన్ని వెరైటీలు ట్రై చేసి చూడండి...

## మటన్ వేపుడు

### కావలసినవి

మటన్: అరకిలో, వెల్లుల్లిరెబ్బలు: పది, పసుపు: టీస్పూను, గరంమసాలా: టేబుల్‌స్పూను, పెరుగు: కప్పు, పలావుఆకులు: రెండు, ఆవనూనె: కప్పు, అల్లంతురుము: టీస్పూను, ఉప్పు: రుచికి సరిపడా

### తయారుచేసే విధానం

పెరుగుని బాగా గిలకొట్టాలి.

మటన్ ముక్కలకు టేబుల్‌స్పూను నూనె, పసుపు, ఉప్పు, పెరుగు పట్టించి రెండు గంటలు నాననివ్వాలి.

బాణలిలో నూనె పోయాలి. అందులోనే అల్లం, వెల్లుల్లి, పలావు ఆకులు వేసి ఓ నిమిషం వేయించాలి. తరవాత అన్నీ పట్టించిన మటన్ ముక్కలు వేసి సిమ్‌లో ఉంచి ఉడికించాలి. చివరగా గరంమసాలా వేసి బాగా కలిపి దించాలి.

## కాశ్మీరీ బిర్యానీ

### కావలసినవి

మటన్: ముప్పావుకిలో, బాస్మతిబియ్యం: కిలో, పాలు: 200 మి.లీ., పెరుగు: 2 టీస్పూన్లు, శొంఠిపొడి: టీస్పూను, యాలకులపొడి: పావుటీస్పూను, నెయ్యి: కప్పు, కెవ్రా ఎసెన్స్: పావుటీస్పూను, కుంకుమపువ్వు: 2 గ్రా., కారం: 2 టీస్పూన్లు, ఇంగువ: చిటికెడు, గరంమసాలా: 2 టీస్పూన్లు, సోంపుపొడి: 2 టీస్పూన్లు, పంచదార: పావుటీస్పూను, ఉప్పు: రుచికి సరిపడా

### తయారుచేసే విధానం

బాణలిలో నెయ్యి వేసి కాగాక ఇంగువ, మటన్ ముక్కలు వేసి ఓ రెండు నిమిషాలు వేయించాలి. అందులోనే పెరుగు కూడా వేసి కలిపి రంగుమారేవరకూ వేగనివ్వాలి. ఇప్పుడు ఉప్పు, కారం, సొంఠిపొడి, పలావు ఆకు వేసి కాసేపు వేయించాలి. తరవాత అరలీటరు నీళ్లు పోయాలి. అరటీస్పూను గరంమసాలా, టీస్పూను సోంపు పొడి వేసి సిమ్‌లో ఉడికించి దించాలి. మటన్ ముక్కల్ని విడిగా ఓ గిన్నెలో వేసి ఉంచాలి.

అదే బాణలిలో రెండు లీటర్ల నీళ్లు పోసి ఉప్పు వేయాలి.

ఇప్పుడు గరంమసాలా మిగిలిన సోంపు పొడి అన్నీ పలుచని బట్టలో మూట కట్టి నీళ్లలో వేయాలి. తరవాత బియ్యం వేసి సిమ్‌లో సగం ఉడికేవరకూ ఉంచి దించాలి. తరవాత అందులోనుంచి నీళ్లు వంపేసి మటన్ ముక్కలూ అన్నమూ పొరలు పొరలుగా మందపాటి గిన్నెలో వేసి మూతపెట్టి సిమ్‌లో దమ్ చేయాలి.






## మటన్ గ్రేవీ

### కావలసినవి

మటన్: అరకిలో, ఉల్లిపాయ: ఒకటి, టొమాటోలు: మూడు, మిరియాలు: టీస్పూను, జీలకర్ర: అరటీస్పూను, వెల్లుల్లి రెబ్బలు: నాలుగు, అల్లం: చిన్నముక్క, దనియాలపొడి: 2 టీస్పూన్లు, కరివేపాకు: 2 రెబ్బలు, ఎండుమిర్చి: నాలుగు, మంచినీళ్లు: 3 కప్పులు, నూనె: 2 టీస్పూన్లు, ఉప్పు: తగినంత



### తయారుచేసే విధానం

టొమాటోలు, అల్లం, ఎండుమిర్చి, వెల్లుల్లి, మిరియాలు, జీలకర్ర అన్నీ కలిపి మెత్తగా రుబ్బాలి.

కుక్కర్‌లో మటన్‌ముక్కలు, ఉల్లిముక్కలు, తగినన్ని నీళ్లు పోసి రెండు విజిల్స్ వచ్చేవరకూ ఉడికించాలి. ఆవిరిపోయాక మూత తీసి రుబ్బిన ముద్ద వేసి కలపాలి. ఉప్పు, కరివేపాకు, దనియాలపొడి, నూనె, కొత్తిమీర వేసి సిమ్‌లో ఉంచి దగ్గరగా అయ్యేవరకూ ఉడికించి దించాలి.

## దాల్ ఘోస్ట్

### కావలసినవి

మసూర్‌దాల్: కప్పు, బోన్‌లెస్ మటన్: కిలో, ఉప్పు: రుచికి సరిపడా, నూనె: 4 టేబుల్‌స్పూన్లు, ఉల్లిపాయలు: రెండు, అల్లంముద్ద: టేబుల్‌స్పూను, వెల్లుల్లిముద్ద: 2 టేబుల్‌స్పూన్లు, జీలకర్రపొడి: టీస్పూను, పసుపు: అరటీస్పూను, గరంమసాలా: టీస్పూను, నిమ్మకాయ: ఒకటి, కొత్తిమీర తురుము: అలంకరణకు సరిపడా

### తయారుచేసే విధానం

ప్రెషర్ కుక్కర్‌లో మటన్‌ముక్కలు, పప్పు, ఉప్పు, రెండు టేబుల్‌స్పూన్ల నూనె వేసి మెత్తగా ఉడికించాలి.

మరో పాన్‌లో రెండు టేబుల్‌స్పూన్లు నూనె వేసి ఉల్లిపాయలు బంగారువర్ణంలోకి మారేవరకూ వేయించాలి. అందులోనే అల్లం ముద్ద, వెల్లుల్లి ముద్దలు వేసి ఓ నిమిషం వేయించాలి. అందులోనే దనియాలపొడి, జీలకర్రపొడి, కారం, గరంమసాలా వేసి నూనె తేలేవరకూ వేయించాలి. ఇందులో పప్పు-మటన్ ముక్కల మిశ్రమం వేసి కలిపి మరో పది నిమిషాలు సిమ్‌లో ఉడికించి దించాలి. ఇప్పుడు నిమ్మరసం వేసి కలిపి కొత్తిమీరతో అలంకరిస్తే సరి.



# బాలవినోదిని

## కుందేలు బ్యాగు...

స్కూల్లో అప్పుడప్పుడూ కొన్ని ప్రాజెక్టు వర్కులు ఇస్తుంటారు. అప్పుడు అవసరమైన కొన్ని వస్తువులను కొంటుంటాం. పని అయిపోయిన తర్వాత వాటిని ఎక్కడెక్కడో పడేస్తుంటాం. మళ్లీ అవసరమైనపుడు అవి ఎక్కడున్నాయో కనిపించక కాసేపు వెతుక్కుని తంటాలు పడుతుంటాం. అలాంటి ఇబ్బందేమీ లేకుండా ఉండాలంటే ఇదిగో ఇలాంటి 'బన్నీ బ్యాగ్' ఒకటి మన దగ్గర ఉండాల్సిందే. వీటిల్లో చిన్నచిన్న వస్తువులన్నింటినీ వేసుకుని ముడివేసి దాన్ని టేబుల్ మీద పెట్టేసుకోవచ్చు. అప్పుడు పెద్ద చెవులున్న బుజ్జి కుందేలు ఒకటి మన కోసమే వచ్చి టేబుల్ మీద కూర్చునట్టుగా భలే ఉంటుంది.





## దారి కనుక్కోండి

ఈ బుల్లి బాతుపిల్లకు తల్లిని చేరుకునే దారి చూపండి.



## విప్పండిచూద్దాం

1. ఎర్రముక్కు దొర, ఎంత సేపు నిలబడితే అంత పొట్టిగా అవుతాడు?
2. వీపు ఉందికానీ వెన్ను లేదు. కాళ్లూ చేతులూ ఉన్నాయికానీ వేళ్లు లేవు?
3. మిద్దె మీద గడ్డి, కోసే కొద్దీ పెరుగుతుంది?

## చెప్పగలరా?

ఇక్కడ తొమ్మిది వాహనాలు ఉన్నాయి కదా. కింది ఆధారాలతో ఏ వాహనం ఎవరిదో చెప్పగలరా?

1. రిషి వాహనం పైవరుసలో ఒక మూలన ఉంది.
2. మహతి వాహనం, గోపీ రిషీల వాహనాల మధ్య ఉంది.
3. జానకి వాహనం కుడిపక్క వరుసలో ఉంది.
4. జానకి వాహనం కింది వైపు అంజు వాహనం ఉంది.
5. సూరజ్ వాహనం పైవైపు గోపి వాహనం ఉంది.
6. మోనిక వాహనం మధ్యలో ఉంది.
7. నీరజ్, అంజుల వాహనాలు పక్కపక్కనే ఉన్నాయి.
8. విజయ్ వాహనం దిగువ వరుసలో ఉంది.
9. సూరజ్ వాహనం మోనిక వాహనానికి ఎడమవైపు ఉంది.







## గప్‌చుప్

1. ఇక్కడ పిల్లలు ఫుట్‌బాల్ ఆడుతున్నారు కదా. వాళ్లలో ఉన్న తప్పేమిటి?
2. ఈ చిత్రంలో ఉన్న వాళ్లే కాకుండా ఇంకో మనిషి కూడా ఉన్నాడు. కనిపించాడా?
3. పక్షులకూ గుడ్లకూ ఒక ప్రమాదం పొంచి ఉంది. అది ఏమిటి?
4. ఆడుకుంటున్న పిల్లలు కాలువకు అటువైపు ఎలా వెళ్లారు?
5. గాలానికి ఒక చేప పడింది కదా. అయితే ఇక్కడ ఇంకో చేప కూడా ఉంది. కనిపించిందా?
6. మునిగిపోతున్న బంతిలో ఉన్న తప్పేంటి?
7. ఈ చిత్రంలో ఆంగ్ల అక్షరం 'F' తో మొదలయ్యే వస్తువులు, ప్రాణులు ఎన్ని ఉన్నాయి?

## రంగులేద్దాం




## పోలికలేంటి?

ఇక్కడ తొమ్మిది బొమ్మలు ఉన్నాయి కదా. అడ్డం, నిలువు, ఐమూలగా వాటి మధ్య ఉన్న పోలికలను చెప్పండి.



ఒకసారి శ్రీకృష్ణదేవరాయలు యుద్ధంలో గెలుపొంది, సభికులకు విలువైన కానుకలు ఇచ్చి సంతోషపెట్టారు. ఆ రోజు అత్యవసరమైన పని ఉండటంతో తెనాలి రామలింగడు సభకు రావడం ఆలస్యమైంది. అతడు వచ్చేసరికి ఒక వెండి గిన్నె మాత్రమే మిగిలింది. చివరిగా మిగిలిన దాన్నే తీసుకుని అందరినీ ఒకసారి పరిశీలించాడు. కొందరి మెడలో బంగారు హారాలు ఉంటే కొందరి చేతికి వజ్రాల ఉంగరాలు ఉన్నాయి. కొందరి తలకు ముత్యాలు పొదిగిన విలువైన తలపాగాలు ఉన్నాయి. రామలింగడి చేతిలో ఉన్న వెండి గిన్నెను చూసి అతడంటే ఓర్వలేనివాళ్లు ఎంతో సంతోషించారు. ఆ విషయాన్ని రామలింగడూ గమనించకపోలేదు.

## విలువైన కానుక



రామలింగడికి బుర్రలో వెంటనే ఒక ఆలోచన తళుక్కున మెరిసింది. వెండిగిన్నెతో నేరుగా రాయలవారి దగ్గరకు వెళ్లి... 'మహారాజా గతంలో నాకు ఎంతో విలువైన బహుమతులు ఇచ్చారు. ఇప్పుడు ఎవరైనా నన్ను మహారాజుగారు నీకు ఏమిచ్చారు అని అడిగితే...ఈ ఖాళీ గిన్నెను చూపించడం ఎంత అవమానంగా ఉంటుందో ఆలోచించండి' అన్నాడు తెలివిగా. 'ఖాళీ గిన్నెను చూపించాల్సిన అగత్యం నీకెప్పటికీ రాదు రామలింగా' అంటూ రాయలవారు వెంటనే తన మెడలో ఉన్న వజ్రాల హారాన్ని తీసి వెండిగిన్నెలో వేశారు. దాంతో రామలింగడికి విలువైన కానుక దొరకలేదని సంతోషించిన వారందరి ముఖాలూ వెలవెలబోయాయి.

## ఆ ఒక్కటీ?

ఇక్కడున్న గుడ్లలో ఒక్కదానికి తప్ప అన్నింటికీ జతలు ఉన్నాయి. ఆ ఒక్కటీ ఏది?



## గుర్తించండి

పక్కనున్న ఎనిమిది విడి భాగాల్లో నాలుగు ఈ చిత్రానికి సంబంధించినవే. వాటిని గుర్తించండి.






### జవాబులు

**గప్‌చుప్:** 1. ఒక అబ్బాయి హాకీస్టిక్ పట్టుకున్నాడు 2. చిత్రాన్ని కుడిపక్కకు తిప్పిచూస్తే నిచ్చెన వెనుక గడ్డి ఆకారం 3. చెట్టు మానులో పాము ఉంది 4. నిచ్చెన సాయంతో 5. మేఘాల్లో 6. బంతి నీటిలో మునగదు 7. Football, Fan, Flask, Fork, Frock, Flower, Fruit, Frog, Fly, Fish.

**చెప్పగలరా:** 1. గోపి 2. మహతి 3. రిషి 4. సూరజ్ 5. మోనిక 6. జానకి 7. విజయ్ 8. నీరజ్ 9. అంజు.

**గుర్తించండి:** 1, 3, 4, 7

**ఆ ఒక్కటీ?:** మూడో వరుసలో మూడోది.

**పోలికలేంటి?:** అడ్డం: టోపీ, జుట్టులేదు, పళ్లు; నిలువు: బౌ టై, మొక్కలు, చారల ప్యాంటు; ఐమూలః చేత్తో పట్టుకుని ఉన్నాడు, బూట్లు లేవు.

**విప్పండిచూద్దాం:** 1. కొవ్వొత్తి 2. కుర్చీ 3. జుట్టు.



‘ఎవరెస్టు శిఖరంమీద ఎగురుతూ ధవళవర్ణంలో ధగధగలాడే హిమాలయ పర్వతశ్రేణుల సౌందర్యాన్నీ ఆ కొండల్లోంచి జాలువారి వయ్యారంగా మలుపులు తిరుగుతూ సాగే నదుల అందాలనూ... ఎంతసేపు చూసినా విసుగనిపించదు’ అంటూ ఆ విశేషాలను మనతో పంచుకుంటున్నారు ఇటీవలే నేపాల్‌ను సందర్శించిన మిర్యాలగూడకు చెందిన బి.దయానంద్.



# మంచు శిఖరాల మీద విమానంలో విహరించాం





చుట్టూ భూభాగంతో ఉండే నేపాల్‌లో ప్రకృతి అందాలకూ జీవ వైవిధ్యానికీ లోటు లేదు. ప్రధాన ఆదాయం పర్యటక రంగమే. అందుకే ఆ దేశాన్ని చూసేందుకు ఖమ్మం నుంచి గోరఖ్‌పూర్ వరకూ రైల్లో వెళ్లి, అక్కడ నుంచి మరో రెండు గంటలు ప్రయాణించి నేపాల్ సరిహద్దుకి చేరుకున్నాం. అక్కడ గేటు దగ్గర తనిఖీలన్నీ పూర్తయ్యాక నేపాల్ లోని భైరవ పట్టణంలో అడుగుపెట్టాం. ఇది విశాలమైన రోడ్లతో చక్కని కట్టడాలతో పరిశుభ్రంగా ఉంటుంది. ఇక్కడ నుంచి ఓ గంట ప్రయాణం చేశాక లుంబినీకి చేరుకున్నాం. బుద్ధుడు జన్మించిన రాజప్రాసాదం ఓ పెద్ద ఉద్యానవనంలో అవసానదశలో ఉంది. మొండిగోడలతో శిథిలావస్థలో ఉన్న ఆ పురాతన రాజప్రాసాదంమీద బౌద్ధమత సంప్రదాయంలో ఓ పెద్ద డోమ్‌ను నిర్మించారు. మర్నాడు పదిగంటలపాటు హిమాలయ పర్వతశ్రేణుల్లో ప్రయాణించి ఖాట్మండు చేరుకున్నాం. ఇక్కడ హోటల్ గదుల ధరలు భారత్‌తో పోలిస్తే చాలా తక్కువ. మన రూపాయి 1.60 నేపాలీ రూపైయాలతో సమానం. పైగా మన రూపాయలు అక్కడ చలామణీ అవుతాయి. నేపాల్‌లో 90 శాతం హిందువులూ పది శాతం మంది ఇతరులూ ఉన్నారు. ఖాట్మండులో చూడాల్సిన ప్రదేశాల్లో పశుపతి నాథ్ మందిరం ముఖ్యమైనది. ప్రపంచంలో మరెక్కడా లేని విధంగా ఈ మందిరంలోని శివలింగానికి నాలుగువైపులా ముఖాలు దర్శనమిస్తాయి. దానిపైన బంగారురేకుతో చెక్కిన శివముఖాకృతిని తొడుగుతారు. భారత సంతతికి చెందినవారే ఇక్కడ పూజారులు. ఈ మందిరానికి దిగువన ఓ పక్కగా భాగమతీ నది ప్రవహిస్తుంటుంది. మందిర ప్రాంగణం నుంచి కిందకు చూస్తుంటే కొంత మంది మంత్రోచ్చారణతో ఓ పార్థివ శరీరాన్ని నదిలో మూడుసార్లు ముంచి ఒడ్డునే ఉన్న చితిపై దహనం చేయడం కన్పించింది. అందులో నుంచి వస్తోన్న పొగ పశుపతి మందిరంవైపు వస్తూ గోపురాన్ని తాకుతూ ఉంటే ఆ శరీరంలోని ఆత్మ ఆ గోపురంద్వారా మందిరంలోకి ప్రవేశించి ఆ దైవంలో ఐక్యమవుతుందా అన్న భావన కలుగుతుంది.

## దర్బారు కూడలి!

తరవాత మేం దర్బార్ స్క్వేర్‌కు వెళ్లాం. రాజమహల్‌తోపాటు ఇతరత్రా అనేక మందిరాలూ ప్రజాదర్బారు భవనాలూ పచ్చికబయళ్లతో ఎంతో ఆకర్షణీయంగా ఉంది. ఇక్కడే కాదు, పాటన్, భక్తపుర్ పట్టణాల్లో కూడా దర్బారు స్క్వేర్‌లు ఉన్నాయి. చెక్కలతోనూ ఇటుకలతోనూ కట్టిన అనేక అంతస్తుల పగోడాలతో ఇవి ఎంతో చూడచక్కగా ఉన్నాయి. ప్రస్తుతం ఈ మూడు పట్టణాలూ కలిసిపోయి ఖాట్మండు వ్యాలీగా మారాయి.

తరవాత అక్కడ నుంచి బౌద్ధ స్థూపానికి వెళ్లాం. బుద్ధుడి మరణానంతరం ఓ పేద మహిళ తన జీవితకాలం కష్టపడి దీన్ని నిర్మిస్తూ మరణించిందనీ ఆమె కోరిక మేరకు నలుగురు కొడుకులూ దాన్ని పూర్తిచేశారనీ చెబుతారు. 118 అడుగుల ఎత్తూ 325 అడుగుల చుట్టుకొలతలతో ఉన్న ఈ స్థూపం ప్రపంచంలోని ఎత్తైన స్థూపాల్లో ఒకటి. ఇక్కడి నుంచి బుడా నీలకంఠ దగ్గరకు వెళ్లాం. అక్కడ ఉన్న నీటికొలనులో ఆదిశేషునిమీద నిద్రిస్తున్నట్లుగా ఉన్న నలభై నాలుగు అడుగుల విష్ణుమూర్తి విగ్రహం ఉంది. క్షీరసాగర మథనంలో ఏర్పడిన గరళాన్ని తాగిన శివుడు ఆ గరళకంఠాన్ని చల్లార్చుకోవడానికి ఈ కొలనులో నీరు తాగాడనీ అందుకే ఆ పేరు వచ్చిందనీ పూజారులు చెప్పారు. ఇక్కడ నుంచి స్వయంభూనాథ్‌కి వెళ్లాం. దీన్నే కోతుల ఆలయం అనీ పిలుస్తారు. ఈ కొండమీదకి రోడ్డుమార్గంలో గానీ 365 మెట్లు ఎక్కిగానీ చేరవచ్చు. ఇక్కడికి ఉదయం తొమ్మిదిగంటలలోపు వెళ్లడం మంచిది. ఓ పెద్ద సరస్సు మధ్యలో దివ్య తేజస్సుతో ప్రకాశిస్తోన్న తామరపుష్పాన్ని దగ్గరగా చూడాలని మంజుశ్రీ అనే యోధుడు కొన్ని కొండరాళ్లను తొలగించి సరస్సులోని నీటిని ఖాళీచేసి ఆ పుష్పం దగ్గరకు వెళ్తూ ఉంటే తామరపుష్పం పెద్ద కొండగానూ దాని తేజస్సు స్థూపంగానూ మారాయనీ అందుకే దీన్ని స్వయంభూ స్థూపం అంటారనీ చెప్పారు. ఈ స్థూపానికి నలువైపులా బుద్ధుడి కళ్లను చిత్రించారు. దీన్ని యునెస్కో ప్రపంచ వారసత్వ సంపదల్లో ఒకటిగా గుర్తించింది.

## పర్వత శిఖరాల్లో విహారం

తరవాత రాయల్ ప్యాలెస్‌కి వెళ్లాం. మ్యూజియంగా మార్చిన ఈ ప్యాలెస్‌లో అనేక కళాఖండాలూ నేపాల్ సంస్కృతీ చిహ్నాలూ ప్రాచీన వస్తువులూ కనిపిం



చాయి. ఖాట్మండులోని థామెల్ ప్రాంతంలో క్యాసినోలూ నైట్‌క్లబ్‌ల సందడి కనిపించింది. తరవాతిరోజు ఉదయం త్రిభువన్ ఏరోడ్రోమ్‌కి వెళ్లాం. ఓ మౌంటెయిన్ ఫ్లైట్‌లో లాంగ్‌టాంగ్ నుంచి గౌరీశంకర్, ఎవరెస్టు, మకాలు వరకూ ఉన్న అన్ని పర్వతాల ఉపరితలాన్నీ చూపించారు. విమానం ఆయా పర్వత శిఖరాలమీద ఎగురుతుంటే సూర్యుడి కిరణాలు ఆ మంచు శిఖరాలమీద రంగులు మారుతూ మంత్రముగ్ధుల్ని చేస్తాయి. ఎవరెస్టు పర్వతశిఖరంమీద ఎగురుతున్నప్పుడు ఎంతో ఉద్విగ్నతకు గురవుతాం. కదిలే మేఘాల నీడలు సూర్యుడి వెలుగులో తెల్లని మంచుకొండలమీద నల్లగా పడుతూ వేగంగా పరుగెడుతున్నట్లు కనిపిస్తుంటే తన్మయత్వంతో చూస్తూ ఉండిపోయాం.

ఆ మర్నాడు ఉదయం ఖాట్మండు నుంచి మూడుగంటలపాటు ప్రయాణించి మనోకామన అనే ప్రదేశానికి చేరుకున్నాం. కొండమీద ఉన్న ఈ మందిరానికి రోప్‌వే ద్వారా ప్రయాణిస్తుంటే ఎంతో థ్రిల్లింగ్‌గా అనిపించింది. ఈ మందిరంలోని అమ్మవారిని త్రికరణ శుద్ధితో ప్రార్థిస్తే మనసులో కోరికలన్నీ నెరవేరతాయట. అందుకే దీనికా పేరు. దర్శనానంతరం అక్కడి నుంచి మూడు గంటలపాటు ప్రయాణించి పోఖరాకి చేరుకున్నాం. ఈ పట్టణంలో సగభాగం సరస్సులే. మరో పక్క మంచుతో కప్పబడిన అన్నపూర్ణ పర్వత శిఖరాలు కనువిందు చేస్తుంటాయి. ఫెవా సరస్సు పక్కన గల బజారులో ఖరీదైన షాపులూ రెస్టరెంట్లూ కనిపించాయి. ఈ పట్టణంలో చూడదగ్గవాటిలో గుప్తేశ్వర్ మహదేవ్ కేవ్ మందిరం ముఖ్యమైనది. ఈ గుహలోకి వెళ్లడానికి సుమారు యాభై అడుగుల లోతుకి ఉన్న మెట్లు దిగాలి. ఈ మెట్లు దిగి కిందకు వెళితే ఓ ద్వారం ఉంటుంది. ఈ ద్వారం గుండా లోపలకు వెళితే ఓ గుహ కనిపిస్తుంది. అందులో కొంతదూరం నడిచాక మరో వందమెట్లు కిందకు ఉంటాయి. అవి దిగుతూ ఉంటే చల్లని నీటి చుక్కలు మన మీద ధారలాగా పడుతుంటాయి. అయినా గాలి లేకపోవడంతో చెమటలు పడుతుంటాయి. అలా మెట్లన్నీ దిగి కొంతదూరం నడిస్తే అక్కడ శివాలయం కనిపించింది. దైవదర్శనానంతరం మందిరం వెనక వైపున ఉన్న గుహలోకి వెళ్లాం. అక్కడ గుహ చాలా ఇరుకుగా ఉంటుంది. తరవాత అక్కడ నుంచి కొంతదూరంలోని ఓ కొండమీద ఉన్న వింధ్యవాసినీ మందిరానికి వెళ్లాం. ఇందులోనే అనేక దేవాలయాలు ఉన్నాయి.

## అది పెద్ద సాహసమే!

తరవాత గబ్బిలాల గుహకి వెళ్లాం. ఇందులోకి వెళ్లడానికి అందరికీ టార్చిలైటు ఇస్తారు. ఈ గుహలో ఏటవాలుగా ఉన్న మార్గంలో యాభై అడుగులు వెళ్లాక గుహ అంతా ఎత్తు పల్లాలతో చీకటిగా ఉంటుంది. కొంతదూరం వెళ్లాక బయటకు రావడానికి మరో మార్గం ఎక్కడో పైన కనిపించింది. అక్కడకు పాకుతూ వెళితే ఓ రంధ్రం కనిపించింది. ముందు చేతులు బయటపెట్టి దాన్ని పట్టుకుని తల బయటకు పెట్టాలి. తలను పూర్తిగా నేలవైపు వంచి చేతులతో పాకుతూ శరీరాన్ని బయటకు లాగాలి. ఇది చాలా క్లిష్టమైన చర్య. పర్వతారోహణ శిక్షణలో ఓ భాగమని ఆ గుహ నిర్వాహకులు చెప్పారు. తరవాత అక్కడే ఉన్న డెవీస్ ఫాల్స్, మహేంద్ర కేవ్స్, ఫెవా సరస్సుల్నీ చూశాం. సరస్సు మధ్యలోని విష్ణు మందిరాన్ని సందర్శించుకుని పోఖరాకు సమీపంలోని సారంగపూర్‌కి వెళ్లాం. అక్కడ బంగీజంప్, జిప్‌మర్, పారాగ్లైడింగ్, రాఫ్టింగ్, క్యాంపింగ్, రాక్‌క్లైంబింగ్... వంటి సాహస క్రీడలు ఉన్నాయి.

## ముక్తినాథ యాత్ర!

మర్నాడు ఉదయం ఆరుగంటలకు ముక్తినాథ్ వరకూ బయలుదేరాం. పోఖరా నుంచి ముక్తినాథ్ వరకు ప్రయాణించడం అంటే ప్రపంచంలో పదో ఎత్తైన అన్నపూర్ణ పర్వత శిఖర వలయాన్ని దక్షిణం నుంచి ఉత్తరం వరకూ అంటే సగభాగం చుట్టి వేయడమే. ఇది సుమారు 15 గంటల ప్రయాణం. బేణి వరకూ మాత్రమే తారు రోడ్డు ఉంటుంది. మిగిలిన రోడ్డు మొత్తం మట్టిరోడ్డు. ఈ మట్టి రోడ్డుమీద భారీ కొండల్ని ఎక్కుతూ లోయలోకి దిగుతూ ప్రయాణించాలి. కొన్నిచోట్ల దూళి బస్సులోకి వచ్చి మనల్ని ఉక్కిరిబిక్కిరి చేస్తుంది. మరికొన్నిచోట్ల బురద ఉంటుంది. ఇక్కడ ఏమాత్రం జారినా కింద ప్రవహించే కాళీ-గండకీనదిలో పడిపోవడం ఖాయం. మరికొన్నిచోట్ల కొండలమీద మేఘాలను తాకుతూ ప్రయాణిస్తాం. అక్కడక్కడ రోడ్డు పక్కన ఉన్న గ్రామాలే మాకు ఆతిథ్యాన్ని ఇచ్చాయి. ఇక్కడి ప్రజలు చాలా కష్టజీవులు. అయినా ముఖంలో చిరునవ్వు చెరగదు. ఏదైనా అడిగితే ఎంతో వినయంగా జవాబు చెబుతారు. యువతీయువకులు అలంకరణకి ఎంతో ప్రాధాన్యం ఇస్తారు. వీళ్లను చూస్తుంటే హిమాలయాలు ఫ్యాషన్లకి పుట్టిల్లేమో అనిపిస్తుంది. కానీ వీళ్ల మాటల్లో ముఖాల్లో అమాయకత్వం స్పష్టంగా కనిపిస్తుంది. భోజనానంతరం మా ప్రయాణం మళ్లీ మొదలైంది. మాతోనే వస్తోన్న కాళీగండకీ నదీ ప్రవాహం పాయలుగా చీలింది. సాయంత్రం ఆరుగంటలకు జోమ్‌సోమ్ అనే చిన్న పట్టణం చేరుకున్నాం. ఆ రాత్రి జోమ్‌సోమ్‌లో గడిపి ఉదయాన్నే ముక్తినాథ్‌కు ప్రయాణమయ్యాం. సుమారు యాభై కిలోమీటర్ల దూరం... మట్టి రోడ్డు ప్రయాణం... మూడుగంటలపాటు ప్రయాణించి ముక్తినాథ్‌కు చేరుకున్నాం. ఇదో అద్భుతప్రదేశం. సుమారు పదమూడు పద్నాలుగు అడుగుల ఎత్తులో ఉన్న ముక్తినాథ్ నుంచి ఎటు చూసినా అన్నీ మట్టికొండలే కనిపిస్తాయి. ఈ కొండలపై ఓ చెట్టుగానీ మొక్కగానీ కనిపించవు. కారణం ఈ కొండలన్నీ పది నెలలపాటు మంచుతో కప్పబడి ఉంటాయి. వీచే చల్లనిగాలులూ నులివెచ్చని నీరెండల మధ్య కనుచూపుమేర వరకూ ఉన్న ఈ మట్టికొండలను చూస్తుంటే నిజంగా మనం భూమిమీదే ఉన్నామా లేక వేరే గ్రహంమీద ఉన్నామా అన్న అనుమానం కలగకమానదు. ఆ వాతావరణాన్ని ఆస్వాదిస్తూ ఒకటిన్నర కిలోమీటర్ల దూరంలో కొండపై ఉన్న మందిరానికి కాలినడకన ప్రయాణమయ్యాం. ఇక్కడ కొండమీదకు ఎక్కేటప్పుడు ఆక్సిజన్ అందక ఇబ్బందితో కిందకు జారే అవకాశం ఉంటుంది. అనేక అవరోధాలను అధిగమించి పురాతనమైన ముక్తినాథ్ మందిరానికి చేరుకున్నాం. ఇది శ్రీమహావిష్ణువు మందిరం. దీనికి వెనకవైపున 108 గోముఖాల నుంచి వెలువడే నీటి ధారల్లో స్నానమాచరించి శ్రీమహావిష్ణువును దర్శించుకుంటే జనన మరణాలనుంచి ముక్తి పొంది ఆ భగవంతునిలో ఐక్యమవుతారని పురాణాలు చెబుతున్నాయి. ఈ దేవాలయంలో పూజారిణులు మాత్రమే ఉంటారు. ఇందుకోసం కొన్ని ప్రత్యేక లక్షణాలున్న బాలికలను చిన్నవయసులోనే గుర్తించి వాళ్లకి శిక్షణ ఇచ్చి పూజారిణులుగా నియమిస్తారు. వీళ్లు జీవితకాలం అవివాహితులుగానే ఉంటూ తమ జీవితాన్ని ఆ భగవంతునికి అంకితం చేస్తారు. దర్శనానంతరం ఇక్కడికి కొంచెం దూరంలో ఉన్న జ్వాలామయి మందిరానికి వెళ్లాం. ఈ మందిరం తలుపులు ఎప్పుడూ తెరిచే ఉంటాయి. లోపలికి గాలి బాగా వీస్తుంది. కానీ మందిరంలో ఉన్న ప్రమిదలోని జ్వాల మాత్రం నిరంతరం వెలుగుతుండటం అద్భుతంగా అనిపిస్తుంది. ప్రకృతి ప్రియులకూ భక్తులకూ స్వర్గధామం అనిపించే ముక్తినాథ్‌కు అయిష్టంగానే వీడ్కోలు పలికి వెనుతిరిగాం.


వ్యాసకర్త(ఎడమ)

